అక్కఱ. 1. స. (కాంక్ష) "కృ, కక్కఱ వదీఱం బొరనక్కఱనం గిరము వేడ్కఱం జేర్పనీక." భార. ఆర. ౭. ఆ: అనురాగము, ఆస, ఆసక్తి, ఇంపు, ఇంబు, ఇచ్ఛ, ఇయ్యఱ, ఈప్స, ఏఁకట, కచ్చు, కసి, కాయువు, కెలసము, కోసరు, కోరిక, కోరికి, కోరికె, కోర్కఱ, క్రొచ్చు, క్రొచ్చు, చనవు, జంజాటము, జడ్డు, జడ్డుఁదనము, తగులము, తగులు, తమి, తరితీపు, తలఁపు, తివుట, తీపి, తాలు, నెక్కలి, పట్టింపు, పట్టు, బాళి, ముచ్చిక, ముచ్చిగ, మాఁటు, ముచ్చట, మోజు, రహి, రచ్చ, వలపు, వేడుక, వేడ్కఱ, సడ్డ, సోము, హాళి.

2. స. (ఆవశ్యక కార్యము.) "వ. నీకునైనయక్కఱ యదీర్చుట వారికగ్గా కృత్యంబు." భార. అర. ౬ ఆ.

3. శ. (శ్రద్ధ.)

4. పా. (ప్రయోజనము.) కొఱ, జోలి, పని, బెరుకు.

5. పా. (నిమిత్తము.) కతము, కొఱ్ఱు, జోలి, నెపము, నెవము, నేము, పట్టు, వయినము, హైనము, సలు.

6. పా. (కార్యము.) అగవు, కర్జము, కారియము, చక్కఱటి, చేఁత, పని, పెంటు.

7. పా. (సంభ్రమము, త్వర.) అడిచిపాటు, అత్తరము, ఆటిముటి, ఆత్రము, ఉత్తలపాటు, ఉత్తలము, కనుకని, కన్కఱని, కప్పరము, కళవళపాటు, కళవళము, కసమస, కసిమసి, చిందిలిపాటు, చిడిముడి, చిడిముడిపాటు, చిఱ్ఱచిఱ్ఱ, జూఁక, తంతీపు, తొందర, తత్తరపాటు, తత్తరము, తత్తఱ, తత్తఱపాటు, తత్తఱము, తమకము, తమి, తరహా, తఱతఱ, తహతహ, తికమక, తొరుగుడు, తొందర, తొందఱ, తొందఱపాటు, తొట్రు, తొడి, దడదడ, గులగుల, పదటము, పదటు, పల్లటము, పెలుచన, పెల్చన, బుడిబుడి, వేగ, వేగపాటు, వేగిరపాటు, వేగిరము, సంబరము, సంభ్రమము, హొరటము.

అక్కఱకాఁడు. వి. (అక్కఱగలవాఁడు.)

అక్కఱగండఁడు. వి. (శ్రద్ధకలవాఁడు.)

అక్కఱపడు. దే. అ. క్రి. (అపేక్షపడు.) తమికొను, పనిపడు.

అక్కఱపాటు. వి. (అక్కఱపడుట.)

అక్కలకర. వి. వై = (అకారా. జ్వరపోదులను పోఁగొట్టుమూలికావిశేషము.)

అక్కలవాడ. చం. (పంటలక్కఱలుండువీధి)

అక్కలి. వి. (తరంగము) "వ. కడలి మొగయక్కలిందగులునడిన జోగునుంబోలె.,, కాశీ. ౨. ఆ: అల, కడలు, కరంటము, కర, కరడు, కరటము, తరఁగ, తెట్టులు, తెర, తాలఁకు, వాఁగులు.

అక్కలించు. వి. స. క్రి. (సగ్గించు.) "అక్కలించినపొట్టనుక్కలించి.,, స్వా. ౧౫ం

అక్కసము. 1. పా. (కార్యము.) మా, అక్కటిక.

2. స. (సంతాపము.) ఆరటము, ఆరాట, ఆరాటము, ఆవి, ఉడుకు, ఉత్తలము, ఉడిల, ఒఱపు, ఒలఁబోక, కంప, కందు, కాఁక, కాఁగుడు, కర్గ, క్రాఁక, క్రాఁగుడు, గోదరు, చిచ్చు, చిటచిట, జూవరము, తనుకు, తన్కఱ, తుందుడుకు, తుకతుక, దగ, నలఁకువ, మండ్రాటము, మఱుకువ, మఱుగుఁడు, మల్లడి, వంత, వగ, వడ, వేండ్రము, వేఁడి, వేఁడిమి, సెక, సెగ, సెవ, సేకము.

అక్కసి. వి. (కోపి.) అక్కసుకాఁడు, కిను

సలు, పునుఁగు, పునాసాటకడాలు, పునుఁగురాజనాలు, పులిగోళ్లవంకెలు, పూఁబాళలు, పూరేకులు, పెసలు,పొంగుపాళ్లు, పొన్నశ్రీరాజనాలు, పోతుగంటరాజనములు, ప్రియాగలు,బంగారుతీఁగెలు, బలుగుత్తులు, బారతసేసలు, బాహుపురులు, బీటిసరులు, బొగడసరులు,బొబ్బరలు, మంకెనలు, మండిగింపెర్లు, మణిసరులు, మదనగంధులు, మన్మథబాణాలు, మల్లెలు,మల్లెశ్రీగంధులు, మామిడిగుత్తులు, మినుములు, ముత్తెసరులు, ముదుకసరులు, ముద్దపాళ్లు, మొలగులికలు, మోసుగుతోడిసలు, మోసుగుమాడలు, మోహనపుసరులు, రణపెండ్లికొడుకులు,రత్నసరులు, రాజనములు, రాజనాలు, రాముబాణాలు, రామసాగరములు, రెడ్డిపాలవంకెలు, రెక్కపాయలు, లత్తుకబొత్తలు, లంకసన్నములు, లంగాకుబుడములు, వజ్రంపుపలుకులు,వట్టిసరులు, వన్నెపూలు,వరలు, వాసనరాజనాలు, వెన్నముద్దలు, వెలువడములు, సంపఁగిపూపిడ్లు, సంపెఁగలు, సంబావులు,సనగలు, సన్నమండెఁగలు, సబ్బబియ్యము, సాలంకలు, సీతాబోగిసరులు, సుకబోగులు.

అక్షింతలు.శ.న.గ్రా.బ.=(అక్షతాః.) తలఁబ్రాలు,దీవనఁబ్రాలు, దీవెనఁబ్రాలు, పచ్చఁబ్రాలు, పాలు,ప్రాలు,మెట్టుఁబ్రాలు, సేసఁబ్రాలు, సేసలు.

అగంఙ్రపాకు.శ. (ఒకానొకచెట్టు.)

అగచాట్లపోతు.శ.(కష్టాత్ముఁడు. ) అగచాట్లమారి, అగసాట్లమారి, కడగండ్లమారి.

అగచాట్లమారి.శ. —పై—

అగచాట్లు.శ.బ.(ఆపద.) చూ,అఆంకిలి.

అగడారు.పా.(నింద,అపవాదము.) అగడు, అపనెపము, అపదు, అపదూరు అపసడి, అపసరి, ఆట, ఆడిక, ఆడికోలు, ఆపడి, ఆబడి, ఆబుదూఱు, ఆముు, ఈసడము, ఈసడింపు, ఎగ్గులు, ఏప, ఏపగింపు, ఏపము, ఓకర, ఓకరింత, ఓకిలి, ఓకిలింత, కళంకు, కింకిరి, కొడిమె, గుహారు, గోరపన, గోరము, గోసు, డాబా, డొగరు, తిట్టు, తిట్టువాటు, తెగడిక, తెగడు, దిసంతు, దూఱు, దూఱు, నేప, పలుకు, పల్కు—, ప్రిబ్బు, మాట, రట్టు, రొచ్చు, రొయి,రొయ్యి, రోఁత, రోయి, ఱట్టడి, ఱట్టు, ఱవ్వ, ఱొచ్చు, వట్టిమాట, సడి, సెగ్గము, సెగ్గింపు, సెగ్గు, సెగ్గము.

అగడిత. శ. వై.= (అఖాతమ్.) అగడ్త, కందకము, దవంత్రి.

అగడ్త.శ.వై.—పై—

అగడు.1.పా.(జలగ్రహము.) నీటిదయ్యము, నెగడు.

2.శ.(నింద.)చూ,అగడారు.

3.శ.(నింద్యము.)"ఎ.గీ.మగుపకావున నిపుడునన్నగడుచెసె.,,పంచ.నార.ఆ:

అగడుపడు.1.శ.అ.క్రి.(నిందింపఁబడు.)ఆడికపడు, ఆబడిపడు, ఆబడిపోవు, తిట్టువడు, దూఱువడు, వీటిబోవు.

2.—(త్వరపడు,తొట్రుపడు,సంభ్రమించు.)"క.బెగడు వలదనుచు బెట్టిద, మగునెవ్వగ నగడుపడుచు నాఁడు పడుచులే,పగవారికివల దననా,పగవారికినేలయొసఁగెఁబద్మజుఁడనుచున్.,,వసు.౬ఆ:అపచిపడు, అడరు, అటిముటిపడు, ఉత్తలపడు, ఉరడించు, ఉర

వడించు, ఉరవణించు, ఉవ్విళులూరు, ఉవ్విళ్లూరు, ఉవ్విళ్లుగొను, ఊటాడు, కప్పరపడు, కళవళపడు, కళవళించు, కెరలు, క్రాలు, క్రేటు, గిజగిజగొను, గిజగిజలాడు, గొదకొను, చింవెలిపడు, చిఱ్ఱులువోడుచు, జాఁకించు, తడఁబడు, తత్తఱపడు, తత్తఱించు, తత్తఱిలు, తత్తఱిల్లు, తమకపడు, తమకించు, తమికొను, తఱతఱలాడు, తఱలు, తలరు, తికమకగొను, తికమకలాడు, తిమురు, తిపురు, తొందరపడు, తొట్రుగిలఁబడు, తొట్రుకొను, తొట్రుపడు, తొట్రిలఁబడు, తొడరు, తొడిఁబడు, తొరపడు, నిగుడు, పదరు, పదురు, బాతలించు, బుడివడు, వీడుపడు, వీడువడు, వేగపడు, వేగిరపడు, వేగిరించు.

అగప. 1. శ. (కొయ్యను టెంకాయ చిప్పను గుఱ్ఱిచ్చిగరిఁటెవలె చేసినది.) అబక, తెడ్డు, త్రెడ్డు.

2. భా. ౨. ౨౭౪. (మహాతండువు.) అపక, అబక.

అగపడు. 1. శ. అ. క్రి. (స్వవశమగు.) " క. ముంగిటి గూబకునగపడి, యంగిలులు వడఁకుచున్న యవి.,, భా. శాం. ౩ఆ: అగ్గపడు, అబ్బు, అలవడు, చిక్కు, చిక్కుపడు, చేపడు, డాకాలముసొచ్చు, తగులు, తగులుపడు, తవులు, తవులుపడు, తొలు, తొలుపడు, పట్టుపడు, పాలుపడు, పాల్పడు, మాటుపడు, లగ్గమగు, లోనగు, లోఁబడు.

2.— (గోచరమగు.) కనుపట్టు, కన్పట్టు, కొలుపడు, కోల్పడు, చూపట్టు.

అగపాటు. శ. (గోచరత్వము.) అగబాటు, అగ్గపాటు.

అగబాటు. 1. పా.—పై—

2. పా. (కష్టము.) అడరు, అల్లట, ఆవలి, ఇడుమ, ఇడుముడి, ఇబ్బంది, ఎవ్వ, కక్కసము, కడగండ్లు, కడిఁది, కాటియ, కొడిమె, కొడివె, గండు, గొడివె, చిక్కు, చోడుము, చోద, డెప్పరము, తోగి, పల్లటము, పాటు, పాము, పీనుఁగుపెంట, బడవ.

అగరుట. ప. ౧. ౨౨. (తీక్ష్ణము.) ఉరుటము, కచ, కరా, కటుకు, చుఱుకు, తీండ్రి, తీండ్రము, బెట్ట, బెట్టిదము, మిట్ట, మిడి, వాఁడి, వాని.

అగలు. శ. వై. = (అగరు.)

అగలుచు. 1. శ. ప్రే. (భేదించు.) అగల్చు.

2. శ. ప్రే. (ఉన్మూలించు.) అగలు, పెల్లగించు.

అగల్చు. శ. ప్రే.—పై—

అగలుసత్తు. శ. వై. (గంధద్రవ్య విశేషము.)

అగలుసాంటి. శ. వై. (పాఠ.) పాట.

అగవాళ్లు. శ. బ. (తేలికయైన ఓరట్టుచెప్పులు.)

అగవు. శ. (కార్యము.) చూ, ౘఅక్కఱ.

అగసాట్లమారి. పా. చూ. అగచాట్లపోతు.

అగసాలి. పా. (స్వర్ణకారుఁడు) అగసాలె, ఓజ, కంసాలవాఁడు, కంసాలి, కమసాలవాఁడు, కమసాలెవాఁడు, కమ్మటీఁడు, కొమ్మరాఁడు, తటరివాఁడు, పటకారుఁడు, పారసి, పొన్నారి, సా[న్నా]రి.

అగసాలె. శ.—పై—

అగసి. పా. వై. = (అవిసె. అగస్తి.) అగిసియ, అగిసె, అవిసి, అవిసియ, అవిసె, నల్లగిసియ, నల్లగిసె, నూనెయగిసె.

అగాదు. శ. (తుపాకిపిరంగి లోనగువానియందునిప్పుఁదగిలించుట)

అగావు. వై. (అఁగ్, తొక్కట్టు.) అడ్డము, ఆయుకట్టు, ఆహంకము, ఈడు, ఉద్దనవు, ఊ

ద్దర్, ఉద్దరువు, ఎగుపల, ఏపు, కుసువ, కోరు, గిరవు, గీవు, తాకట్టు, తేగడ, ఫాయిదా, పెనుపు, బంధకము, బోగ్రిది, రో, రోయి, వారకము.

అగిని.శ.వై.(అగ్ని.) చూ,అంటునిజెజె.

అగిసియ.శ.వై.=(అగస్త్యః) చూ,అగిసి.

అగిసె.శ.వై.=—పై.—

అగు.1.పా.అ.క్రి.(భూధాత్వర్థకము.)

2.శ.అ.క్రి.(అగు.) అగుడెంచు, అవు, జొ, కలుగు, కొంచబడు, కొనలయు, పొసగు, పోవు.

3.శ.స.క్రి.(కలుగు.)

అగున్.శ.అవ్య.(అంగీకారార్థకము.) అగుఁగాక, అవున్, ఆ, జొ, కాని, మంచిది, వల్లె, సరి.

అగుఁగ దే.శ.అవ్య. (ఆశ్చర్యార్థకము.) చూ,౪.అక్కొ.

అగుఁగాక.శ.అవ్య.చూ,అగున్.

అగుఁబొమ్ము.శ.అవ్య. (యథార్థవచనము.) "అనిచెప్పినవినియగుఁబొమ్మని కైకొని.,, భార.విరా.౧.ఆ: జౌను,సరే,హౌసరే.

అగుడెంచు.శ.అ.క్రి.చూ,౨అగు.

అగుర.శ.అవ్య.(ఆశ్చర్యార్థకము.) చూ,౪.అక్కొ.

అగురా.శ.అవ్య.—పై—

అగురు.శ.(వీరణము.) అవురు, జొరు.

అగులు.1.భా.౩.౯౧.అ.క్రి.(విచ్ఛిన్నమగు) ఎడలు, పగులఁబాఱు, పగులు, పవులు, పొలు, విచ్చు, విరియఁబాఱు, విరియు, విఱియు.

2 .శ.అ.క్రి. (రాలు, గళితమగు.) "వ.శిరంబులనొగిలించియు నీసకంబుల నగిలించియు.,, భాగ.౬స్కం: అవులు, ఊరలు, ఊడు, ఒలుకు, జొలు, కాలు, కువ్వరిలు, చింకు, డుల్లు, డొల్లు, పడు, పిఱిదులు, రాలు, విదుకు, విదలు, సడలు, సన్లు.

అగ్గపడు.శ.అ.క్రి.చూ,౧.అగపడు.

అగ్గపాటు.శ.చూ,అగపాటు.

అగ్గము.1.శ.(గోపురము.)

2.శ.(అక్షనము.) చూ,౨.అంకియ.

అగ్గలము.1.భా.౧.౬౬ (అతిశయము.) అగుబ్బు, ఉద్దరము, ఎలుగు, ఎసకము, ఏత్తెఱ, కడిమి, కడిమ్మ, కరిమి, కఱ్ఱ, కొసరు, క్రొందు, గాటము, జగజగింపు, తనుపు, తనువు, తొలఁకు, దిటము, నవుపు, నిబ్బరము, సంచారము, పెంపు, పెచ్చు, పెలుచ, పెలుచన, పెల్చు, పెల్చన, పెల్లిదము, పెల్లు, పేరిమి, పేర్మి, బిట్టు, బీరు, బెట్టు, బొంబిరి, మిక్కిలి, మిక్కుటము, మిటారము, మెండు, మెండి, లావు, నట్టు, వేఁక, వేఁకము, సంకడి.

2.శ.(అధికము) చూ,౪.అంకపొంకములు. "క. బిలువిద్యనొరులనీకగ్గలముగ లేకుండఁజేసి నన్నుఁగని యుబ్బుచు.,, భార.ఆది.౧ ఆ:

అగ్గలించు.1.శ.అ.క్రి.(అతిశయించు.) చూ,౭.అతిరు.

2.—(ఉత్సహించు.) చూ,౧.అంగలించు.

అగ్గలిక.1.పా.(ఉత్కంఠ.) ఆలపోక, ఉబలాటము, ఉబ్బు, ఉబ్బూత.

2.శ.(ఉత్సాహము.) చూ,౩.అంగద. "గీ.అనినవట్లకౌశయుని సర్వసేనాధిపత్యభారపట్ట బంధమునకు,నియోగించి యొకపుడయ్యగ్గలికఁ గొని,యాజనిభుఁడు పరిముదితాత్ముఁడగుచు.,, భార.ఉద్యో.౪.ఆ:

3. పా. (విలాసము.) ఎమ్మె, ఒయారము, ఒయ్యారము, ఓయారము, కులుకు, కేరడము, గునుపు, గోనపు, గోనము, చిటకము, చిట్టంటుగోతిలు, చిన్నెయు, చిన్నె, టీకు, టీవి, టెక్కు, టెక్కరము, టెక్కు, నిక్కు, నీటు, పొలుపు, బిటారము, బిత్తరము, బులుపు, బెడంగు, బెడగు, బెళుకు, బెళగు, మస, మిటారము, మిటారింపు, మురిపెము, ముసువు, లలి, వగ, వెళకు, వెలుకు, సొగసు, హొలి, హొయలు, హొరంగు, హొరగు.

4. శ. (శౌర్యము.) అగ్గలికము, అబుము, ఉక్కు, ఏడ్డెము, కడిది, కడిమి, కడ్మి, కడుసు, కసుకు, గట్టి, గురుసు, గోహరి, చులుకు, డాక, దంటి, నెజె, ప్రాపు, పొంపు, పొనుపు, పోటు, బిగువు, బీరము, సుగంపెము, మగపాటి, మగపాడి, ముటి, మొక్కలము, మొగ్గలము, నడి, నడిగలవనము, నాడి, నాడిమి, వాని, విడి, వీక, వీసు, సోవ, సోమము.

5. శ. (ఆధిక్యము.) "అచ్చెరువైనవిక్రమమునగ్గలికలై." భార. విరా. ౪. ఆ. అదను, ఉబ్బకము, ఎక్కుడు, ఎక్కువ, ఎగువ, ఎచ్చు, ఎస, ఏపు, కడిమి, కడ్మి, దళము, పంతము, పెక్కువ, పెనుపు, పెలుచ, పెలుచన, పెల్చు, పెల్చన, పెల్లు, పొలుపు, మించు, మించునల, మెండు, మేలిమి, మేలుచేయి, మొగ్గు, వలను, వాసి, హెచ్చు.

అగ్గలికము. శ. (శౌర్యము) చూ. ౪. అగ్గలిక. "పేర్చినయగ్గలికంబున" భార. కర్ణ. ౨. ఆ.

అగ్గి. 1. శ. వై. — (అగ్నిః) ఇంగలము, ఇంగిలము, ఐదారు, ఐరువు, కణము, చిచ్చు, డిగ్గి, తెలి, తెల్లి, నిప్పు, నిప్పుక, మగ్గె, వయిరవులు, వయిరాలు, వైరవులు, వైరాలు.

2. భా. ౧. ర్త. (చేతవాచేతనాగ్ని) కిత్తు, కిత్తు, చిచ్చు.

అగ్గించు. స. వై. స. క్రి. (వినుతించు.) కైవారముచేయు, కొండాడు, కొనియాడు, గణుతించు, పేరుకొను, పేర్కొను, పొగడు, పొగుడు.

అగ్గింపు. పా. (స్తోత్రము, వినుతి) అకలింపు, ఉగ్గడింపు, కయివారము, కైవారము, కొసరు, గడన, గణుతి, పొగడిక, పొగడికోలు, పొగడిత, పొగడు, పొగడుట, పొగడ్త, పొగడు, బడాయి, మెచ్చు, మెప్పు.

అగ్గికంటి. శ. (శివుడు.) చూ. ఆంగమొలు వేల్పు.

అగ్గిచూలి. శ. (కుమారస్వామి.) ఆఱుమోముల వేలుపు, కందుడు, కొంచమలగొట్టి, నజానుడు, కొమరసామి, కొమరుడు, కొమరుసామి, గట్టువేటికమనుమడు, గుజ్జుసెదోడు, జమిలిముత్తల, జుట్టుపిట్టతాలుపు, తీగపేరికల్కి మగడు, నెమ్మిరవుతు, నెమ్మిజోడు, పుంజుదాలుపు, బారకయిపోటరి, ముద్దయ్య, ముగ్గలతల్లులబిడ్డడు, రక్కరక్కసుమిత్తి, అల్లుచూలి, విప్పగండ్లమొత్తముపదినాలు, వెనకయ్యవెనకయ్య, వేలుపుమికొండు, వేలుపులమూక పేరిటి నెలగమిగడు, వేల్పుగమికాడు, వేల్పుజేటిసవతికొడుకు, సంపుడు, సత్తితాలుపు, సామి, సెగపాపడు.

అగ్గిత్తడి. ప. ౫. ౧౫. (మేషము.) అడవిమేక, ఇనుపలతేజి, ఏడిక, తగరము, తగరు, పొట్టేలు, పొట్టేలు, పొట్టేలు, వేట.

అగ్గిబూడి. పా. (కరదీపము.) తద్విశేషము

ల్లి, జేలరి, మొఱఁగు, మోసగాఁడు, లయు
కారి, వెడ్డరి.

అటమటము. 1. శ. (అసత్యము) చూ, ౨. అట
మట. "క. ఎటువలె వచ్చునో మీఁదట,
నటమట మో లేక నిజమొ యది యెఱుఁ
గము గా." సా. ౨. ఆ.

2. శ. (వ్యర్థము) చూ, ౫. అటమట. "క.
మంత్రిప్రవరం బెటుల, ట్లటమట మై పోఁ
జూచిన." రామా. ౬. ఆ.

అటమటించు. 1. శ. అ. క్రి. (చలించు) "వ.
మెఱుఁగుతుమ్మెదవన్నె పెన్నెఱులన
టమటించు నెన్నడుములవిన్ను వన్న ద
న్ని. స్వా. ౫. ఆ: అదరు, అవురు, అవు
రుచు, అవురొప్పు, అదురిచు, అల్లలనాడు,
అల్లలాడు, అల్లల్లాడు; అల్లాడు, ఆసియా
డు, ఆడు, ఇసిరింతలువాఱు, ఉదురు,
ఉరలఁబాఱు, ఉరియాడు, ఉరియు, ఉ
ఱ్ఱటలూఁగు, ఉఱ్ఱుట్లూఁగు, ఉఱ్ఱూఁత
లూఁగు, ఉలియు, ఉలివాడు, ఊగు,
ఊటాడు, కత్తరిల్లు, కదలాడు, కదలు,
కసరు, కుదులు, క్రాలు, గెంటించు, గెం
ట్టు, చంగలించు, చిందులు, చిట్లాడు, చే
డ్పడు, జంకాడు, జడియు, జవ్వాడు,
తకపికలాడు, తడఁబడు, తత్తఱించు, త
త్తఱిల్లు, తత్తఱిల్లు, తమకించు, తమకి, త
ఱలు, తలఁకించు, తలఁకు, తల్లడించు, తల
డిల్లు, తలరు, తల్లడగుడుచు, తల్లడపడు,
తల్లడిలు, తల్లడిల్లు, తల్లడించు, తుంపెస
లాడు, తుంపెసలుగునియు, తుప్పలు
దూలు, తూఁగాడు, తూఁగియాడు,
తూఁగు, తూలఁబాఱు, తూలాడు, తూ
లియాడు, తూలు, తెవలు, తొడిఁబడు,
తొనఁకు, తొలఁకాడు, తొలఁకు, నట్టా
డు, నడయాడు, పంకించు, పదరు, పల్లటి
లు, పల్లటిల్లు, బిత్తరపోవు, బిత్తరించు,
బెగ్గిలు, బెగ్గిల్లు, బెదఁకు, బెణఁకు, బెళఁ
కు, మిడుకు, మిసుకు, వణఁకు, వడఁకు, వీఁగి
యాడు, వీఁగు, వెగడుపడు, సలించు, సుడి
వడు, సురుగు.

2. శ. స. క్రి. (వంచించు) "గీ. యతినవు
చువే భా..లనటమటించి, పాంచితటి
వేచికన్నియఁగొంచునరిగె." విజ. ౩. ఆ:
అడకించు, ఊటించు, కనుఁబ్రామ్రు, క
నుమూయు, కనుమొఱఁగు, కన్నుమొ
ఱఁగు, కన్మొఱఁగు, కికురించు, కికురువె
ట్టు, కికురువోడుము, కిక్కురించు, కిక్కు
రువెట్టు, గినుమాడు, చిక్కుఁజేయు,
చొక్కడు, జూటాడు, తక్కు, తటమ
టించు, తటపట చేయు, దాఁగురించు, వం
డించు, పిక్కు, బెల్లించు, జేలువుచ్చు,
బొంకించు, మొఱఁగు, మోసపుచ్చు, మ్రు
చ్చిలు, వెడ్డువెట్టు.

3. —. (అపహరించు) చూ, ౪. అంకిం
చు. "క. తిమ్ముఁడనని న్నెగి కనమ్మం గొన
చ్చునిట్లు నాకో సఁగకర, త్తన మ్మటమ
టించుకొంటివి, పాన్మిక." వి. పు. ౬ ఆ:

అటమటింపు. పా. చూ, ౧. అటమట.

అటమటీఁడు. శ. చూ, అటమటకాఁడు.

అటమార. 1. పా. (వ్యర్థము) చూ, ౫ అటమట

2. పా. (పలాయనము) అటమరింపు.

అటమరింపు. పా. చూ, ౨. అటమర.

అటి. శ. విశే. (అటువంటి) అటువంటి, అట్టి.

అటిక. శ. (ప్రతలాల్పభాండము) అట్టిక, ఎ
సల, చట్టి.

అటిక మామిడి. శ. చూ, అటక మామిడి

అటు. శ. అవ్య. (అపరోక్షము. తథార్థకము)
అటులన్, అటులు, అట్లు, అట్టులన్,
అట్టులు, అట్టువోలెన్, అట్లు.

అటుక. శ. చూ, అటక.

అటుకులు. పా. బ. (పృథుకములు) అడుకులు

త్తెర, అడకొత్తు, ఆకొత్తు, పోఁకొత్తు.

అడకత్తెర. పా, —పై—.

అడకము. శ. (లోపలనణఁగినది, అంతర్భూతము) "ద్వి. నానామరేంద్ర బృందము మాయ లెల్ల, హరిమాయలోపల నడకములే." విష్ణు. పు. ౧. ఆ: ఇమిడిక, తీలు.

అడకర. పా. (క్షమ, శాంతము) "అడకర మాలి యుప్పగిరినాడఁగఁ జెల్లునె ముద్దకన్నెకున్." నీలా: ఓపిక, ఓపు, ఓరిమి, ఓరుపు, ఓర్పు, తాలిమి, తాల్మి, తాళిక, తాళిమి, నిమ్మళము, నిమ్మళి, నెమ్మది, సయిఁపు, సయిఁపుడు, సయిరణ, సైఁపు, సైఁపుడు, సైరణ.

అడకించు. 1. శ. స. క్రి. (అపహసించు) "చ. పలికిననట్లయున్న దియొపత్త్రిక లోనడకించె దోననున్, జెలియిటు మాపుయోయయనుచు." పరిభా. 3. ఆ: అవహసించు, ఆరిగొను, కేరు, క్రేడిసేయు, క్రేణిసేయు, గుంజనుసుగు, గేలికొట్టు, గేలికొను, ఎక్కలించు, తెచ్చనసేయు, నవ్వు, పరియాచకముసేయు, పిసాళించు, మేలమాడు, వెక్కిరించు, సయ్యాటించు.

2—(వంచించు) చూ, ౨. అటమటించు. "గీ. అకట నీవు నన్ను నడకించిపోఁ జూచె, దేను మోసపోను గాని." భో. ౩. ఆ.

అడఁకువ. శ. (నమ్రత. వినయము) అణఁకువ, అణుఁకువ, అణుకువ, డిందు, మంపటు, మడుఁగు, మడువు, మగ్గు, మణుఁగు, మణువు.

అడకొత్తు. శ. చూ, అడకత్తు.

అడఁగారు. శ. అ. క్రి. (ఉపశమిల్లు) అడఁగు, అణఁగారు, అణఁగు, అఱఁగు, ఆఱు, ఇంకు, ఇముడు, ఉంకు, ఉడిగిల్లు, ఉడుఁగబడు, కుందు, కుదియు, క్రుంగు, చల్లారు, డయ్యు, డింపు, డిందుపడు, డిగఁబడు, డొంకు, తగ్గు, తాఱు, తీలగు, తీలుపడు, తూలు, తేఱు, దిగఁబడు, పాసుపడు, పాస్పడు, పొలివోవు, మట్టుపడు, మడుఁగు, మడువు, మగ్గు, మణుఁగు, మణువు, మునుగు, ముడుఁగు, మునుగు, మున్గు, ముప్పటిలు, లోఁగు, లోవు, వాఱు, క్రొంగు, సగ్గు, సమయు, స్రగ్గు, స్రుక్కు.

అడఁగు. 1. శ. అ. క్రి. —పై—

2—(తగ్గు) అణఁగు, ఊరఁబోవు, ఎత్తువోవు, కడఁబడు, కుంటుపడు, కుందు, కృశించు, కుఱుచపడు, డిగు, డుంకు, తీయు, ప్రిదులు, మందటిలు, మ్రందటిల్లు, ముడుఁగు, వట్రపడు, వాగ్రిలు, సగ్గు, స్రగ్గు, స్రుక్కు.

3—(నమ్రమగు) అడఁగు, మడఁగు, మడుఁగు, మడువు, మగ్గు, మణఁగు, మణుఁగు, మణువు, మొత్తఁబడు, వంగు, వాలు.

4—(చెడు, నశించు) అణఁగు, అణుఁగుపడు, అఱు, అవియు, ఆఱు, ఎత్తువోవు, ఏగు, కడచను, కడచు, కడతేఱు, కడివోవు, కుంటుపడు, కోలుపడు, కోలుపోవు, కోల్పడు, గిట్టు, చెడు, తీఱు, తీఱుపడు, తోడువోవు, తుఱుంగు, తుఱుంగుడుపడు, నలఁగు, నాసిరిల్లు, పరియు, పఱివోవు, పొడవడగు, పానుగుపడు, పొలియు, పొలివోవు, పోకాడు, పోవు, బసివోవు, బుఱ్ఱంగు, వచ్చమాయు, మలుగు, మాయు, మాఱు, మాలు, ముక్కు, మునుఁగు, మున్గు, ముసించు, మూఁడఁబోవు, రూపుసెడు, సమయు, సరిపోవు, సరియగు.

5—(లోఁబడు) అణఁగు, లొట్టపోవు.

అడఁగుబొద్ద. శ. (బేలుదారి లోపల నణఁగి యుండు నట్టుగోడయంచులయందు గి

తిరుమొప్పుబడెడు బొద్దు)
అడగొను.శ.అ.క్రి. (ముద్దకట్టు)
అడగోలుకొను .శ.స.క్రి. (అపహరించు) చూ,౪.అంకించు.
అడచిపాటు.పా.(శీఘ్రము) చూ,౧.అంకపాంకములు.
అడంచు.శ.పే్ర.(అడంగజేయు)అణచు.
అడజడి.శ.(దుఃఖము) చూ,౫.అంగద.
అడజడిపెట్టు.శ.స.క్రి.(దుఃఖపఱచు) ఏపఱించు, జాలిఁబెట్టు, దుఃఖపెట్టు.
అడదడి.శ. (ప్రభుత్వము. [అప్రి])
అడది.పా.వై.(హారిద్రావర్ణము) అలిఁది,అళఁది, చిక్కసము,పచ్చ,పచ్చఁదనము, పచ్చన, పసపు, పసరు, పసరుచాయ, పసిరిక, పసుపు, హాళఁది.
అడప.1.పా.(పశుపాదరోగము) అడుప, గొరిసెగాలి.
2.శ.(అడపముంచుకొని యుండువాఁడు ది)అడపకత్తియ, అడపకత్తె.
అడపకత్తియ.శ.చూ,౨.అడప.
అడపకత్తె.శ.—పై—
అడపకాఁడు.శ.(అడపముంచుకొని యుండువాఁడు)
అడపట్టె.శ.(పొలములో విత్తనములువిత్తి మిట్టపల్లములు సమముగుటకై యెడ్లనుకట్టితోలెడుమాను)అడ్డపటియ, అడ్డపట్టె, అడ్డమాను.
అడపము.1.శ.(తాంబూలదాని)ఆకుసంబెళ, పదరము, పట్రము, సంబిళిక, సంబెళ, హడపము.
2.శ. (మంగలిపెట్టె) క్షైసాల,పొది, హడపము.
అడపర.పా.(పిండము)చూ,౧.అడ.
అడపాడ.శ.(అడుగులగుఱుతు)జాడ.
అడబాల.1,శ,వై.(పాచకుఁడు)పంటిగొడ్డి, పానసీఁడు, పూఁటకొాఁడు, బాసనీఁడు, బోనకాఁడు, వంటటి, వంటలవాఁడు, వంటవాఁడు, సువారంపువాఁడు.
2.శ.వై.(పాచకురాలు) చూ,౨.అక.
అడరించు.శ.పే్ర.(బాణమును ప్రయోగించు)"సీ.అతఁడడరించునానాస్త్రశస్త్రముల" మార్కం౬ఆ.అడరుచు,అడర్చు
అడరు.1.శ. (అధిక్యము) చూ,౫.అగ్గలిక. "గొనములసంద్రమయిత్తైలఁగునఁ జాలుపుఁదేర్ల తేఁడు కొదయొదవనిపెం, పునవడరొందుచు." అచ్చ. అ.కాం:
2.పా.(కష్టము) చూ,౨.అగబాటు.
3.భా.క.రా3.అ.క్రి.(ఒప్పు)అమరు,అలరారు, అలరు, అరు, ఎనయు,ఎలరారు, ఎసఁగు, ఒనరు, ఒప్పారు, ఒప్పు, కొలలు, క్రాలు,చను,చెలఁగు, తనరిల్లు,తగు,తేనరు,తనరుచు,తనర్చు,తేలరు, తుఱఁగలించు,పరఁగు,పరిఢవిల్లు,పొనరారు, పొనరు, పొలుచు,పొలుపారు, పొల్పారు, పొసఁగు, పోలు, మెలయు, మొనరు, రహించు, రాణించు,వఱలు, వెలయు, సవరిల్లు.
4.శ.అ.క్రి.(వ్యాపించు)"క.వఱపులు పన రుచఁ,ల్లఱచుటబెట్టిదురుగాలి యడరుట.భార.కర్ణ.౨.ఆ.:అత్తమిల్లు, అఱుక్రమ్ము, అలము, అలముకొను,అవఘళించు , ఉసికొను, ఒదువు, ఒలయు, కడలుకొను, కడలొత్తు, కడలొ్క్కొను, కప్పు, కప్పుదెంచు, కమియు, కలగొను, కవిచేయు, కవియు, కవియుదెంచు, క్రమ్ము, గుడికొను, చించు, చిట్టాడు, చిలుకు, చెరలాడు, జీరువాఱు, డీకొను, తఱుము,తారసించు,తాఁకసిలు, తారసిల్లు,తిప్పురుకట్టు,

నటు, సుక్కి.

4.పా.(వ్యథ, దుఃఖము)చూ,ాఅంగద

5.శ.అ.క్రి.(ఏడ్చు,రోదించు)అఱచు, ఏకుచు, ఏడ్చు, కనికరించు, కూపెట్టు, మొఱయిడు, వగచు, వాపఱచు, వాపోవు.

6.—.(విలపించు) "సీ. అనివిలాపింప నూరార్చిమేటికిఁ గ్రిప్పుఁ బాసిగొడ్డొఱలెడిపగిదినడలె,దు.,, జై.ఉ.ఆ: అఱచు, ఒఱలు, క్రిందు, ఖోలు, వనరు.

7.—(శోకించు)"క. భీష్ముపాటుసెప్పుచు, నడలికడున్నాద నొసఁగ నా క్రిందించెన్.,, భార. భీష్మ.౧.అ: అడలుకొను, అలఁగు, ఉమ్మలించు, ఉమ్మలికించు, కనికరించు,కుందు,-చూకురుపడు, దుఃఖపిల్లు, పేర్మిముడించు,ముచ్చిరు, వగచు, వనరు.

8.—(భయపడు)-చూ,అంజు."సీ.పల్లరంబిడులోనెపొరుపత్తెముసేయు,నతివకొయింపఅకడలుకుడుపు.,, పాంచా.3.ఆ:

అడలుకొను.శ.అ.క్రి.(శోకించు) చూ,2. అడలు.

అడవి.శ.వై.=(అటవి,అరణ్యము)ఎడారి, ఎడారు, కాడు, కాన, కారు, కోన, చేను, పొలము, లొంక.

అడవికంద.శ.(సర్పనాళము)

అడవికాఁకర.శ.(కర్కోటకి,ఆఁగాఁకర, మటుకాఁకర.

అడవికాఁపు.పా.(వనసంవాసి)అడవినెలవరి, అడవినెలవు, అడవియునికిపట్టు, జడదారి, జడలదారి.

అడవికిక్కస.శ.(దేవనాళము)

అడవికుక్క.శ. (వృకము) గొఱియలసూఁడు, తోఁడెలు, తోఁడేలు,తోఁడేలు వు, మేఁకతిండి.

అడవికోడి.శ. (వనకుక్కుటము) కొనపుంజు,కారుకోడి, గునసనకోడి, పొదకోడి.

అడవిగనసు.శ.(పిండాంశుకము)

అడవిచెఱకు.శ.(కాంతారము)

అడవిచేమ.శ.(గకుటము)

అడవితిరుగుడు.శ.(వానరము,కోఁతి)అడవినట్టు, ఎక్కిరింతమెకము, కొండతిమ్మరి, కొమ్మ టెంకి మెకము, కొమ్మతిమ్మరి,కొమ్మదాఁటుమెకము, కొమ్మమెకము, కోఁతి, కోనతిమ్మరి, కోనమనికి, క్రోఁతి, గట్టుఁదిమ్మరి, చెట్టుఁదిమ్మరి, చెట్టునట్టు,తఱులమెకము, తఱులమోరమెకము, తిప్పతిమ్మరి,తిమ్మఁడు, నేలపట్టి,మగనిబంటు, మలమనికి,మలమన్కి, మల్లు,మ్రానుదిమ్మరి, మ్రానుమనికి,మ్రాన్దిమ్మరి, మ్రాన్మనికి, వెకిరింత.

అడవితొగరి.శ.(తువరిక)

అడవితొలసి.శ.(క్షువకము)

అడవిదున్న.శ. (వనమహిషము) కారుపోతు, కారెనుపోతు, కాఱుదున్న,కాఱుపోతు, కాఱెనుఁబోతు.

అడవిదోమ.శ.(వంశి)

అడవినట్టు.శ.(కోఁతి, వానరము) చూ,అడవితిరుగుడు.

అడవినువ్వులు.శ (జర్తిలము)

అడవినెలవరి.పా.చూ,అడవికాఁపు.

అడవినెలవు.పాం.వి.2.—పై—

అడవిపంది.శ.(వనసూకరము)ఏకలేఁడు, ఏతలము, బంటుమెకము, మొట్టిమెకము, మోటజారుమెకము, మోటుమెకము, మోటువామెకము, రోబంటలి, లోబంటరి, వాలుమెకము, వేల్పులమి

త్తి, సలుగు.

అడవిపుట్టువు.ప.౧.౭౭.(ఐరావతము) చదలయేనుగు, చవుదంతి, చౌదంతి, జాల్పుట్టువు, తెల్లయేనుగు, నీరుపుట్టువు, మబ్బురూపరి, మొదటిహత్తి, వెలిగారు, వేగంటియెక్కుడు, వేలుపుల గారు.

అడవిపెసలు.శ.(వనముద్గము)

అడవిప్రత్తి.శ.(భారద్వాజి)

అడవిబచ్చలి.శ.(వనోపోదక)

అడవిబీఱ.శ.(కోశఫల) ఆనప, ఊరబీఱ, కాక్షీఱ, చేతిబీఱ, వెఱ్ఱిబీఱ.

అడవిమనికిపట్టు.పా.చూ,అడవికొఁపు.

అడవిమల్లె.శ.(ఆస్ఫోట)

అడవిమామిడి.శ.(ప్రియాలము)

అడవిమామెన.శ.(శారికాభేదము)

అడవిమునగ.శ.(వనశిగ్రువు)

అడవిమేఁక.శ.(ఇడిక్కము, మేషము) చూ,అగ్గితత్తడ.

అడవిమొల్ల.శ.(యూథిక)

అడవియులవలు.శ.(వనకులుద్థము)

అడవిసదాప.శ.(శాలేయము)

అడవీఁగ.శ.వై.(దంశము)

అడసాల.శ.వై.(మహానసము) పానసము, బానసము, బోనపుటిల్లు, మల్లసాల, వంటకొట్టము, వంటయిల్లు, వంటసాల, వంటిల్లు, సువారంపుటిల్లు.

అడి.1.శ.నై.ఉప=(అతి, అధికము) చూ,౪ అంకపొంకములు. "క.అడిసిగ్గులుతెమకంబులు,నుడివోవఁగ,, మార్క.౮.ఆ: 2.శ.నై.ఉప.(వ్యర్థము) చూ,౧.అటమటు. "క. అడిబీరపుఁదులువగెలుచు నటె పాండవులన్.,, భార.ద్రో.౪.ఆ:

అడిగండ్లు.శ.బ.(మడువఁగా అడుగుననిలిచి నవాళ్లు)

అడిగము.శ.(భారవిశేషము)

అడిగఱ్ఱలు.శ.(పాదుకలు) "ద్వి.హారగణంబులకెల్లనడిగఱ్ఱనవిన.,,ప్రభు.౪.ఆ: అడియొత్తులు, గొడుగుపావలు, పాఁకోడు, పాగలు, పాగాలు, పావకోళ్లు, పావలు, పావాలు, పావుకోళ్లు, మెట్టులు, సంబవులు, సంబాళిగలు, సమ్మాళిగలు.

అడిగిననొసఁగెడి యావు. సాం.౧. ౧౯. (కామధేనువు) ఈవులమొదవు, చదలుఁదోడుకు, జేజేగిడ్డి, తెలిమొదవు, తెల్లమొదవు, పాల్కడలికొన్ను, పుడుకుఁదోడుకు, వింటిపసి, వెదకిలఁబడుఁదోడుకు, వెలిగిడ్డి, వేలుపుగిడ్డి, వేలుపుటావు, వేల్పుగిడ్డి.

అడిగొంటు.పా.(కుత్సితుఁడు,కుజనుఁడు) అడిగొట్టు, ఉక్కివుఁడు, ఉలిపి, ఉలిపిగొట్టు, ఏతర, ఒఱపిడి, కఱటి, కల్లరీఁడు, కుచ్ఛితుఁడు, కూళ, కూళఁడు, గడుసు, గరాసు, గొంటరి, గొంటు, చిలుమువాలు, చెడుగు, చెనఁటి, చెన్నఁటి, టక్కరి, టాటోటు, టాటోటుకాఁడు, తపలికాఁడు, తప్పులాఁడు, తులువ, దోసకారి, నాలిబూతము, నాలిముచ్చు, పలువ, పిసాళి, పెఱగాయ, ప్రాపీనపితు, పేరజము, మొండికట్టె, మొక్కలి, మొక్కలికాఁడు, మొక్కలీఁడు, రేపడు, లండి, లండీ, లండు, లండుఁబోతు, సుడియ.

అడిగొట్టు.శ.—పై—

అడిగొంటుతనము.పా.(కుజనత్వము)

అడిచిపడు.1.శ.అ.క్రి.(త్వరపడు, సంభ్రమించు) చూ,౨. అగడుపడు.

2.—(మండిపడు) "గీ.అడిచిపడు నాజ్యహోమమంత్రాక్షతలకు,, నై.౪.ఆ:

ఎగసిపడు.
అడిచిపాటు.శ.(సంభ్రమము,త్వర) చూ, ౨.అక్కజ. "సమరము పేక్షించితాంతి మైనుండెవనడిచిపాటేటికి.,,భార. భీష్మ.3.ఆ:
అడితి.శ.(ఒకవర్తకుఁడుమతి యొకనిం పెడు సరకులనమ్మి మరల వానికిసరకులు గొనిపంపుటకై వానిసద్దనూటికింత యని పుచ్చుకొనెడితలు గు)
అడితాగ్రుడు.శ.(దుర్భిక్షము,క్షామము)కఱవు, కొటకము, నిట్టు, సెవ్వ.
అడిదపుమెకము.శ.(శరభమృగము) ఎని మిదడుగుల మెకము, ఏనుఁగుల గొంగినూఁడు, చవుగంటి, చొంగంటి, కచ్చి కాళ్లమెకము, దచ్చి యడుగుల మెకము, మీఁగండ్లమెకము,సింగంపుగొంగ, సెరబము.
అడిదము.శ.(ఖడ్గము,కత్తి)అలుగు, కన్క, కగ్గము, కటారి, కటారు,కత్తి,కత్తియ, కత్తె, కరవాలు, కరాచుగక, కరాచురి, కరాచూరి, ఖండా, తరవలి, తఅవళి, తలివము, నరాజి, నరాజీ,నారాజి,పట్టియము, పట్టెము, పిరంగి, పేరంగు, వాలు.
అడిబండ.పా.(దుష్టుఁడు)అసుగాకి, అలజాతి, అలవ,అపదగాకి, ఆకతాయ, కల్లరి, కల్లరీఁడు, కొయ్యదిప్ప,గరాసు, గుండఁగొయ్య, గొంటు, గొప్పు,చిలిపి, చెట్ట, చెదుజాతి, తిప్పకాయ, తుంట, తుంటరి, తూఁట, తూఁటరి, తూఁడరి, దుండగీఁడు,నడుకఁడు, దోసకారి, నరకఁడు, పడిసేటు, పలుగాకి, పలుగు, పలువ, పల్గాకి, పాడెగట్టు, పాపాలపుద్ద, పాలసుఁడు,పావి, పాడుప,పాడుపఁడు,పోచకాఁడు, పోలున, పోలెవాఁడు,పల్లదకాఁడు, పల్లదీఁడు, పల్లదుఁడు, బండ, బండగుఁడు,బండఁడు, బాకిళ్లమారి, రాలుగాయ, వెంబరి, సుద్దులమారి.
అడిబీరము. పా.(గజాదిమదము)గజ్జు, దిమ్మ, మత్తా, మత్తు, మస్తు.
అడియఁడు.శ.(పాదసేవకుఁడు)
అడియరి.1.శ.(సేవకుఁడు)"ఇంక,నడియరితనమునన పాండవులనాశ్రయింపఁగఁ జాల.,,భార. సౌ ప్తి.౧.ఆ: ఊడిగీఁడు, కొలువుకాఁడు, కొలువుడుకాఁడు, కొల్వుడుకాఁడు, జీతగాఁడు, డింగరీఁడు, డింగిరుఁడు,పనివాఁడు, పాత్రఁత, బంటు, బానసీఁడు, బోడిక, లెంక,సరవుఁడు.
2.శ.(లోభి)"క.యోగాగ్రమడిగిన గ్రము, యోగముననుఁబెట్టల మునడియరి యైతా,భోగాగ్రముగాదాచిన, యోగమ బాహ్యుండుకాక యైజన్మించున్.,, విజా.ఆచా.కాం.: ఈలగొడ్డ,కక్కుఱితికాఁడు, కొటిక, పిసిడి, పిసినారి, పిసిని, పిసినిగొట్టు, బంకముచ్చు.
అడియాలము.శ.(చిహ్నము)చూ, అంకనము.
అడియాళము.—పై—
అడియాస.1.పా.(అత్యాశ)
2.శ.(ప్రత్యాశ, కలుగునని డియాశ)
అడియొత్తులు.శ.చూ,అడుగొత్తులు.
అడిసాటా.శ.(వెలుగుబోము)
అడుసు.1.శ.(పఙ్కము) బొంది, దొంతి, దొర, సపుసు.
2.పా.(భయము)చూ,అంజిక.
అడుకులు .శ.బ.చూ, అటుకులు.
అడుగంటు.శ.అ.క్రి.(పట్టు,శోషించు)ఇంకు, ఇగురు, ఇవురు, ఈఁకు, కూచు,ఎం

బాఁదు, బాఁదుకొను. మొత్తు, మోఁదు, రాకించు, రుత్తు, వ్రేటుగొను, వ్రేయు.

అడుజు.శ.(శ్యేనభేదము)తద్విశేషములు.—ఆణుజు,ఈలగ్రద్ద, ఓరణము, కంచుమించు, కడసరము, కడుజు, కణసెరము, కణుజు, కనిసెరము, కురుజు, గిద్దు, గిద్ద, చంచడము, చాఁపగద్ద, చెంచడము, చెంచెడము, జలకట్టెయ, జలకట్టె, జాలి, జాలియ,జాలె, జావడము, జెలాకంటె, డేగ, తళుకు, తోఁచిగాఁడు, నేలాఁపు, బయిరి,బాఁజు, బెళకు, బైరి, లగడు, లగుడు,వయిల, వారణము, వేసడ, వేసడము, వ్రేస్టము, వైల,సారణము, సాలువము, సాళువము, సాళ్వము, సెలకట్టెయ,సెలకట్టె.

అడుప.శ.చూ,అడప.

అడుపు.శ.(తాడనము) ఆటు,కొట్టు,గాఁత, తాఁపు, దెబ్బ, నిడ్డ, పెట్టు, మొత్తు, లత్త, లాటు,వేటు, వేఁత, వ్రేటు, వ్రేఁత.

అడుప.శ.(పురాతనము) పాతఁత.

అడువు.1.శ.(పాదము)చూ,౧.అంజ.
2.శ.స.క్రి.(పరిష్ణముచేయు)చూ,౨.అడుగు.

అడువుఁబుట్టువు.శ.(శూద్రుఁడు) చూ, ౨.అడుగుపుట్టువు.

అడుసు.శ.(పంకము,బురద) అవుజు, అసలు, ఉబ్బిలి, ఉమ్మలి, ఊబి, ఒండు, కేజు, చదుకు, చవుకు, జవుకు, జొతుకు, జొకు, దమ్ము, పంకి, బందన, బాడె, బురద, బెందడి, రొంపి,రొచ్చు, బొచ్చు,వండడు, వండు, సుబ్బలి.

అడ్డు. చూ, అడుగు.

అడ్డ.1.పా.స.(చతుస్సంఖ్య)ఉడ్డ,ఉడ్డాచవు, చవుకము, చౌ, చౌకము, తిగ్గంచ, తీఁంచ,నాలుగు, నాలువు, నాల్గు, పుంజీ.
2.శ.(కుంచములోసగము)
3.శ.వై.(గుంటకలోనగువానిదిండు)

అడ్డంకి.శ.(నిరోధము)చూ,౪.అంకిలి.

అడ్డకట్ట. శ (ఏఱులోనగు వానినీళ్లు వెలికిఁబోకకట్టెడుకట్ట)అన,కట్టుఁగొమ్మ.

అడ్డకట్టు. శ. స.క్రి. (నిరోధించు) చూ, అంకిలిపెట్టు.

అడ్డకత్తి. శ. (పట్టిసము) తరవరి, తరవలి, పట్టము, పట్టెము, పట్టెస,మొహదా.

అడ్డకమ్మి .శ. (గడపయందు త్రొక్కుడుకమ్మికిసరిమీఁదు గా నడ్డముగా నేర్పఱపఁబడినదారువి శేషము.నాస.)

అడ్డకట్ట.శ.(నిరోధము.) చూ,౪.అంకిలి.

అడ్డకొడెము.శ. (మత్స్యములఁబట్టు నొకానొకసాధనము) తత్సాధనములు.—కొడెము,ఓట్టి.

అడ్డగాలు.శ.(నిరోధము.)చూ,౪.అంకిలి.

అడ్డగించు. శ. స. క్రి. (నిరోధించు)చూ, అంకిలిపెట్టు.

అడ్డచాఁపు. శ (అడ్డవాసపు దూలము.)

అడ్డనము.1.శ.వై.(ఖేటకము)"ఐ. అంతఁగోధనుండు గరవాలంబు నడ్డనంబునుగొని."రా.యు.కాం.: అరిగ,ఒడ్డనము, కేడము, కేడెము, కేవడము, డాలు,డాలువాఱు,దడిగ, పలక,హరిగ.
2.శ.వై.=(అడ్డనమ్. బెత్తములోనగు వానిచేతఁ జేయఁబడిన కేడెము.) ఒడ్డనము.

అడ్డపట్టెయ.శ. చూ,అడపట్టె

అడ్డపట్టె. శ.—పై—

అడ్డపట్టు. శ. స. క్రి. (అడ్డముగాపట్టు)

"ద్వి. అడ్డపట్టెడుబాలుఁడటవెరయో యమ్మ". సా.

అడ్డపట్టుపాప. పా. (స్తనపాయి, శిశువు) అడ్డపాప, ఎఱగందు, కందు, కందువు, కసుఁగందు, కున్న, కూన్న, కూన్నఁడు, కూన, చంటిపాప, చంటిపాపఁడు, చంటిపిల్ల, చంటివాఁడు, చేతిబిడ్డ, నిసుఁగు, నిసువు, పరచంటివాఁడు, పసిపాప, పసిబిడ్డ, పాప, పాలపాపఁడు, పాలబుడుత, ప్రాప, బిడ్డ, బుడుత, బుడుతఁడు, బురుక, బురుకఁడు, సిసువు.

అడ్డపడు. శ. అ. క్రి. (అభ్యంతరమగు) చూ, అంకిలిపడు.

అడ్డపాటు. 1. శ. (నిరోధము) చూ, ౪. అంకిలి.
2. పా. (కప్పు, అచ్ఛాదనము) అడ్డము, అడ్డి, అట్టాఁక, ఇఱుము, ఎడతెఱపి, ఎడతెర్పి, ఎడరు, ఓలము, ఓలిమి, కనుమరువు, కప్పు, కప్పుదు, చఱపు, చాటు, తెరపి, తెఱప, తెఱపి, పొదుగుడు, పొదువు, మఱుఁగు, మఱువు, మాటు, మాయి, ముసుకు, ముసుఁగు, ముసుఁగుడు, ముసువు, మూఁత, మూయి.

అడ్డపాప. 1. శ. (అడ్డముగా పట్టదగినశిశువు, స్తనపాయి) చూ, అడ్డపట్టుపాప.
2. శ. (దూరదృష్టిలేని కన్నులలోనగువానిపాప.)

అడ్డపెట్టు. 1. శ. (నిరోధము) చూ, ౪ అంకిలి
2. శ. స. క్రి. (నిరోధించు) చూ, అంకిలిపెట్టు.
3—. (ఈడుపెట్టు)

అడ్డబాస. శ. (నాసాభూషణము) తద్విశేషములు.—నత్తు, బులాకి, బులాకు, బేసరి, ముంగర, ముక్కర, ముక్కఱ, ముక్కఁగమ్మి, ముక్కుపోఁగు.

అడ్డమాను. శ. చూ, అడపట్టె.

అడ్డము. 1. శ. (నిరోధము) చూ, ౪ అంకిలి.
2. శ. (వ్యవధానము) చూ, ౨. అడ్డపాటు.
3. శ. చూ, అగావు
4. శ. (ప్రూఁట)
5. శ. విశ. (నిరోధకము)

అడ్డములేనివాఁడు. పా. (నిరవగ్రహుఁడు) ఇచ్ఛనుండువాఁడు.

అడ్డవాట్లు. శ. బ. (నిరోధము) చూ, ౪ అంకిలి. "నీవేలదానికిఅడ్డవాట్లువేసెదవు,,

అడ్డవాతియమ్ము. శ. (విశాలముఖ సాయకము) పారావతము, పాఱవాతమ్ము, పాఱమ్ము, పాఱవాతియము.

అడ్డవేడెము. శ. (ప్లుతగతిభేదము) తద్భేదములు.—గంతు, చుట్టువేడెము, జంగ, జగగంతు, దవుడు, దాఁటు, దుముకు, పల్లటి, పేరె, మురువనడ.

అడ్డసరము. శ. వై— (అటరూషః)

అడ్డసార. పా. (శారి) సారె, సొగటము.

అడ్డసాళులు. శ. బ. (పాశకలు) అడ్డసాళ్లు, కసబులు, నటలు, నామరులు, పాచికలు, పాసికలు, సారెలు.

అడ్డసాళ్లు. శ. బ. —పై—.

అడ్డాదిడ్డ. శ. (అక్రమము) "వాఁడుఅడ్డాదిడ్డి మాటలాడుచున్నాఁడు.,,

అడ్డి 1. భాం. ౧౭౬. (వ్యవధానము) చూ; ౨. అడ్డపాటు.
2. శ. (నిరోధము) చూ, ౪ అంకిలి.

అడ్డిగ. పా. (పణార్థము) అడ్డుగ.

అడ్డిగలు. శ. బ. (కంఠభూషా విశేషము) తద్విశేషములు.—. అఱడా, అఱడు, ఉత్తండము, ఉత్తండాలు, కంటసరి, కంటియ, కంటె, కట్టాణిగుండు, కుతికంటు, గోదుమపూసలు, గోళ్లకుతికంటు, తరగతిగుండ్లు, తీఁగ, తీఁగియ, తీఁగె, తీఁగెమెడ

నూలు, తీవ, తీవియ, తీవె, నాగపడగలదండ, నాగపడగలు, నాను, నానుత్రోవి, పట్టెడ, పలకసరి, పలుకసరి, పుంజాలదండ, పైఁడికంటె, బిరికీ, మల్లెమొగ్గలు, మెడనూలు, సరడు.

అడ్డిపడు. శ. అ. క్రి. (అభ్యంతరమగు) చూ, అంకిలిపడు. [అప్రి])

అడ్డీ. శ. (అనుకైనవస్తువుయొక్క పూఁత.

అడ్డు. 1. శ. (నిరోధము) చూ, ౪. అంకిలి.
2. శ. స. క్రి. (నిరోధించు) చూ, అంకిలిపెట్టు.

అడ్డుగ. శ. చూ, అడ్డిగ.

అడ్డుగఱ. 1. శ. (నిరోధము) చూ, ౪ అంకిలి.
2. శ. (గడియమ్రాను)
3. శ. (విఘాతము) "క. నీయడ్డుగఱమాటల, కీయడఁబనియేమి." రుక్మాం. ౫. ఆ:

అడ్డుగొను. శ. అ. క్రి. (అభ్యంతరమగు) చూ, అంకిలిపడు.

అడ్డెడు. పా. (రెండుమానికెలసరుకు)

అణక. శ. చూ, ౨. అంక.

అణకించు. శ. స. క్రి. (అపహసించు) చూ, ౧. అడకించు.

అణఁకువ. శ. చూ, అడఁకువ.

అణఁగారు. శ. అ. క్రి. చూ, అడఁగారు.

అణఁగు. శ. అ. క్రి. చూ, అడఁగు

అణఁచు. శ. ప్రే. చూ, అడఁచు.

అణుఁకువ. పా. చూ, అడఁకువ.

అణుకువ. పా. —పై.—.

అణుకువాఁడు. పా. (మల్లజాతీయునకంటె నన్యుఁడు)

అణుజు. 1. శ. (శ్యేనభేదము) చూ, అడుజు.
2. భా ౨. ౯౯. (ఈఁక రాల్చినపక్షి) కురుజు, గూఁటిగువ్వ.

అతగాఁడు. శ. స. (ఆమనుష్యుఁడు, అశబ్దమునకు మహదర్థక పుంలింగైకవచనము) అతఁడు, ఆతగాఁడు, అతఁడు, ఆయన.

అతఁడు. శ. స. —పై—.

అతకరించు. 1. శ. వై. స. క్రి. = (అధఃకరణమ్) [-ము.
2—. (అతిక్రమించు) చూ, ౨. అంగవించు

అతగుఁడు. 1. పా. (అమాంసుఁడు) బక్క, బక్కవాఁడు, బడుగు, బడువు, బెండుమానిసి, వక్కికట్టియ, వక్కికట్టె, వగ్గు.
2. పా. (దరిద్రుఁడు) గుల్లకాఁడు, పంజె, పరికట్టె, పేద, బికారి, బికాసి, బీద, బ్రిక్క, భికారి, లొల్లెగాఁడు.

అతర్కణము. శ. వై. (మట్టుమీఱిన కార్యము)

అతలకుతలము. పా. (శ్రమము) అతలాకుతలము, అలకువ, అలఁత, అలపు, అలయిక, అలవు, అలసట, ఇజూకు, ఓలాకు, కొంకు, కుసిగుంపులు, గాసి, చీకాకు, చెక్కుచెదుర్పు, తవతవ, డప్పి, తంట, తహతహ, దప్పి, దప్పిక, నలఁకు, నలఁకువ, నలఁగుడు, నిక్కుచ్చి, పాటు, బడలిక, లంపట, వడ, వేసట, సరమ, సేద, సోమ.

అతలాకుతలము. పా. —పై—.

అత్తిప. శ. (స్త్రీ) అన్ను, అన్నువ, అలరుఁబోఁడి, ఆఁటది, ఆఁటు, ఆఁడది, ఆఁడుకూఁతురు, ఆఁడుది, ఆఁడుపుట్టువు, ఇంచుఁబోఁడి, ఇగురుఁబోఁడి ఇంతి, ఉగ్మలి, ఉవిద, ఎలనాగ, ఒప్పులాఁడి, కన్నియ, కన్నె, కన్య, కలికి, కలువకంటి, కొమ్మ, కోమ, కోమలి, క్రొలుగంటి, గుమ్మ, గొంతి, గోతి, గోల, చాన, చామ, చిగురుఁబోఁడి, చిగురుఁబోఁణి, చిలుకలకొలికి, చెలి,

చెలియ, చెలున, చెల్వ, చేడియ, చేడె, జోటి, జోటిక, తమ్మికంటి, తలిరుఁబోఁడి, తియ్యఁబోఁడి, తీఁగఁబోఁడి, తీఁగెఁబోఁడి, తెరవ, తెఱవ, తొగకంటి, తొయ్యలి, తోయలి, నడఁబోఁడి, నలి, నవలా, నాతి, నాతుక, నెలఁత, నెలఁతుక, పడఁతి, పడఁతుక, పణఁతి, పణఁతుక, పయిదలి, పువుఁబోఁడి, పువ్వారుఁబోఁడి, పూఁబోఁడి, పూవుఁబోఁడి, పైదలి, పొలఁతి, పొలఁతుక, పొలతి, పొలుతుక, పొల్తి, పొల్తుక, పోలి, ప్రోయాలు, బిత్తరి, బోటి, బోఁడియ, బోణి, మగువ, మచ్చెకంటి, మడఁతి, మడఁతుక, మానిసి, మించుఁబోఁడి, మిటారి, ముగుద, ముదిత, ముదియ, ముద్దియ, ముద్దుగుమ్మ, మెఱుఁగుఁబోఁడి, మెలఁత, మెలఁతుక, మెల్త, మెల్తుక, లేమ, వలఁతి, వాలుగంటి, వాలుగకంటి, వాల్గంటి, విరిఁబోఁడి, వెలఁది, వెలఁదుక, సకి, సకియ.

అతివిస.శ.వై.=(అతివిష)

అతివాసము.శ.వై. (శ్రాద్ధదినమునకు ముందుదినము)

అతుకు.1.పా. (సంధాన వసనఖండము) అదుకు, అస్తరు, అస్తరువు, మాసిక.

2.శ.(అతుకుట) అదుకు.

3.శ.(అతికిన తావు) అదుకు.

4.శ.అ.క్రి.(అంటుకొను) అదుకు.

5.శ.అం.ప్రే.(అతికించు) అదుకు.

అత్త.1.శ.(మగనియొక్క తల్లి)

2.శ.(భార్యయొక్క తల్లి)

3.పా.(తండ్రిసోదరి)

4.పా.(మేనమామభార్య)

అత్తడి.శ.(గోడిగబుతువు) నత్తడి.

అత్తపత్తి.శ.(నమస్కారి) పొత్తిదామర, ముడుఁగుఁదామర, మూఁకుఁగుఁదామర, మొగడుఁదామర, సోఁకుడుఁముడుఁగు.

అత్తమిల్లు.1.శ.వై.అ.క్రి.(శయనించు) "సీ. పెనుఁబాఁపనునుఁ బానుపునఁదమ్మి యింటితొయ్యలి యజ్జలొత్తఁగనత్తమిలిన,వెన్ను నను." అచ్చ.బాలకాం.: తెండు, తెనమఱు, తెన్నుండు, తేఁడు, తొంగు, తొన్నుండు,పండు,పండుకొను, పవళసేయు, పడు, పన్నుండు, పరుండు, పవడించు, పవళించు,పవ్వడించు, పవ్వళించు.

2.—(వ్యాపించు)చూ,౨.అడరు."క. అంగళ్లముంగిళ్ల నత్తమిల్లినముత్తియంపు రంగవల్లులమీఁద" జై.౨.ఆ:

3.—(అస్తమ్.అస్తమించు)"సీ. ప్రాలేయకిరణబింబంబు వెల్వెలఁ బాతియస్తాచలంబుపైనత్తమిల్ల.,, కాశీ.౧.అ: కుంకు, కూకు,నింగిపడు,పడు.

4.—(ఒఱగు,అవనతమగు) "కాయలుంత్తుంగ కుచపాళి నత్తమిల్ల.,, స్వా.౨.ఆ: ఒడ్డగిలు, ఒడ్డగిల్లు, ఒరగఁబడు, ఒరగు, ఒరగువోవు, ఒఱగు,ఒఱగఁబడు, ఒఱగువోవు, ఒఱవఁబడు,ఒఱవు, ఓఱగిల్లు, ఓరవోవు, కయిజాఱు, కయివ్రాలు, కైజాఱు, కైవ్రాలు, కొంగొడుపడు, కొంగొడువోవు, చాగిలు, చాగిల్లు, చాఁగు, చేరు, తొప్పతిలు, తొప్పతిల్లు, తొప్పఱు.

అత్తము.1.శ.(అరఁటిపండ్లగెల)అత్తెము.

2.పా.(సమూహము)చూ,అంటలు.

అత్తరము.శ.(సంభ్రమము)చూ,౨ అక్కఱ.

అత్తరు.శ.(సుగంధతైలము)అత్తరువు, తా

2—(బాధపడు,శ్రమపడు) చూ,౨అ లఁగు.

అలుగులము.శ.చూ,అలుగుల.

అలుచు.శ.వై(మందుఁడు,మత్తుఁడు) కా వలుఁడు,డిమ్మరి,దిమ్మరి, దిమ్మరీఁడు,బ య్యేఁడు,మత్తుఁడు,మదట, మస్తువాఁ డు,మెదుక.

అలుపము.శ.వై(అల్పము) చూ,౨అన్నువ.

అలువు.1.శ.చూ,అలుగ.

2.శ.అ.క్రి(కోపముచేయు) చూ,అచ్చ లించు

3—(ద్రోహముతలఁచు)చూ,౨ అలు గు"వినుమున రేంద్రవిప్రుఁడలి వెన్,, భార.శాం.౧అ:

అల్కు.శ.చూ,ఆలుక

అల్కుడు.శ(శబ్దము)చూ,అలికిడి

అల్గు.1.శ(బాణముములికి,ఫలము)చూ, ౨ అలుఁగు

2.పా.(జలనిర్గమస్థలము)చూ,అలుగ

అల్జడి.1.పా.(వేదన)

2.పా(వేదనవలనఁగలుగుతొందర))

అల్ల.1.శ.విశ(ప్రసిద్ధిని తెలుపును)చూ, ౨ అల"అల్లనాఁడు"

2.శ.వై=(అలసః,మందము)"అల్లనగు చు"జబ్బు, జినుఁగు,జిలిబిలి,జిలుఁగు, దళసరి, నాలి, మసలిక, మెతుక,మె దుక, మెదువు

అల్లకము.1.పా(కౌపీనము) కచ్చ, కచ్చడ ము, గోఁచి, గోణము, గోణాము, గో వణము, చీరము, తడుపు,పొట్టము,బొ ట్టము,లంగోటి

2.శ(వ్యాతి)చూ,౨అనికి

అల్లకల్లోలము.శ(వ్యత్యస్తము) చూ, ఆక టవికటము

అల్లట.1.పా(దుఃఖము)చూ,౩ అంగద

2.పా(కష్టము) చూ,౨ అగచాటు

అల్లటపెట్టు.శ .స.క్రి (శ్రమపఱచు)

అల్లదనము.పా(సౌందర్యము)చూ,౨అంగ ము

అల్లన.1.శ.వై(తిన్నగ)"అల్లనినగవు,, ఒ య్యన, ఒల్లన, ఓయన,తిన్నన, మెల్లన

2.శ.వై(మెల్లన)"అనిలజుఁడోయి రా వణుఁడయల్లన నేటికిఁ బెట్టు చెప్పెదన్,, రామా.౬.అ:ఒయ్యన, ఒల్లన,ఓయన, తిన్నన, మెల్లన

అల్లము.శ.వై=(ఓల్లః,ఆర్ద్రకము)

అల్లరి.శ(దోషప్రకటన)ఆరుమాటు, రద్ది, రద్దు

అల్లలనాడు.శ.అ.క్రి(చలించు)చూ,౧అట మటించు"లేనడు మల్లలనాడ,, స్వా. ౨అ:

అల్లలాడు.శ.అ.క్రి—పై—

అల్లల్లాడు.శ.అ.క్రి—పై—

అల్లాడు.1.శ.అ.క్రి—పై—

2—(తిరుగు)తిరగఁబడు

అల్లాటము.శ.(అల్లాడుట)

అల్లారుడు.శ. ప్రే (అల్లాడఁజేయు)

అల్లారువు.శ (అల్లార్చుట,విక్షేపణము)" వాలంబున ల్లార్చుల్ గాడ్పుల రేఁచ,, రామా.౬అ:

అల్లారుబెల్లము.శ(మిక్కిలిప్రియము) "గీ. ఎల్లబంధులకునల్లారుబెల్లమై,,కళా.౬. అ:

అల్లారుముద్దు.1.పా(జనసమ్మతి)

2.శ(మిక్కిలిమనోజ్ఞము)

అల్లి.1.పా(ఉత్పలభేదము)

2.పా(వ్యాతి)చూ,౨అనికి

3.శ(బాలక్రీడావిశేషము)చూ, అంద లములు

4.శ(పచ్చిగానుండు నవుడే మంట వే

యుటకుయుక్తమైన యొకానొక చెట్టు)

అల్లిక.శ(వ్యూతి)చూ,౨అనికి

అల్లిచెట్టు.పా (వృక్షవిశేషము)

అల్లితెమ్మెర.శ(శీతవాయువు)ఈఁద,ఈఁదర, చలిగాలి

అల్లిబిల్లి.1.శ(పెనఁకువ)అల్లిబిల్లిక, పెనఁగు
2.శ(మిత్రిభావము) చూ,౩ అంటు''గీ. అరిగితనకూర్మిచెలువతోనల్లిబిల్లి, యగుచునెప్పటియట్లనెయ్యమున నుండె,, పర.౩.ఆః

అల్లిబిల్లిక.శ—పై—

అల్లిబిల్లికొను.శ.అ.క్రి (పెనఁగొను) ఉగ్గులువాఱు, గుంజులాడు, చిఱుముట్టాడు, తిరితీపులాడు, దొమ్ములాడు, పిరిగొను, పీఁకులాడు, పెనఁకువలుగొను, పెనఁగఁబడు, పెనఁగాడు, పెనఁగు, పెనఁగులాడు, పెనఁగొను, పోరాడు, పోరితమాడు, మలగొను, మలయు, మల్లడిగొను, మల్లడించు, మల్లాడు, ముడిపడు, ముప్పిరిగొను, మెలిగొను, మెలిపడు, లాగులాడు, వెంటిగొను

అల్లిమత్తు.పా(మల్లయుద్ధకాయమానభేదము)పరితాత్రిడు, విస్సంతు, వెలిచిత్తరి

అల్లియ.శ.(మార్వ్య)చూ,౨అరి

అల్లియము.శ(జామాతృత్వము) అల్లెము, మనుగుడుపు

అల్లు.1.శ.అ.క్రి(తీఁగ పాఱు)
2.శ.స.క్రి(అల్లిక వేయు)

అల్లుఁడు.శ(జామాత)అల్లువాఁడు, పెండ్లికొడుకు

అల్లుడు.శ(వ్యూతి)చూ,౨అనికి

అల్లుఁడుకొమాళ్లు.పా (ప్రభువుతోసముగభుజించియతనికంగరక్షులుగానుండువారు)

అల్లుబచ్చలి.శ(కలంబి)తీఁగబచ్చలి, తీఁగబచ్చలి

అల్లువాఁడు,శ.చూ,అల్లుఁడు

అల్లె.శ(మార్వ్య)చూ,౨అరి

అల్లెదమ్మ.శ(మత్స్యభేదము) చూ,అంబుపక్కెర

అల్లెము.శ.చూ,అల్లియము

అల్లొనేరెడు.1.శ(జంబువు)అల్లోనేరేడు, నేరెడు, నేరేడు
2.శ (రాజజంబువు) అల్లోనేరేడు

అల్లోనేరేళ్లు.1.శ.బ(బాలక్రీడావిశేషము) చూ,అందలములు
2.పా.బ(నటవిశేషము) తద్విశేషములు—కేకిసలు, కైలాటము, కైవారపుచేతులు, కొల్పుసేయి, గిడిగిళ్లు, గొండీలు, గొణిగలు, గొబ్బిళ్లు, గోవిందములు, చిన్నిపువ్వులు, చిన్నబూచె, చెంగనాలు, చేవిప్పు, జోడాలు, జోదాలు, జోదిస్లు, జోహారు, టెంకణాలు, డింగిళ్లు, డెంకణము, దీవెనకోల, నవిజోబిళ్లు, నివాళికరములు, నేరేడల్లులు, పడుబాటు, పరపుకరము, పింపిళ్లు, పింపిసలు, మన్నెలు, వెన్నెల, వెన్నెలచిన్నిపువ్వులు, సరిటెంకణము, సాగింత, సాగుబళా, హాణిగలు

అల్వరించు,శ.ప్రే.చూ,అలవరించు.

అళఁది.శ.వై=(హారిద్రా)చూ,అడది.

అళిది.1.పా.వై—పై—
2.పా.వై(సరళము)చూ,౨అలిది.

అళము.శ(ఉప్పుపంటపెట్టెడియేఁ బదిపాదులకొలఁదినేల: ఉప్పమ్మెడుచోటు. అనికొందఱు)

అళఘూరతి.పా(ఆరాత్రికావిశేషము)ఏకాదశారతి, కుంభారతి, గరుడారతి, పంచారతి, పురుషమృగారతి.

అలుకరి.శ(భయశీలుఁడు) కొశ, వెఱపరి.
అలుకు.1.శ(భయము) చూ, అంజిక.
2.భా.3.౫౨.అ.క్రి(భయముఁజెందు) చూ, అంజు
అస్కు.భా.౧.౧౩౩(భయము) చూ, అంజిక.
అవ.1.శ.వై=(అమ్బా.మాత) చూ, అప.
2.శ.వై(జననీజనకులతల్లి) అవ్వ.
3.వైకృ.(పూజ్యస్త్రీ) చూ, అక.
అవగడము.పా.వై= [అవకటః. అపరాధము] చూ, అయిపు.
అవఘళము.1.శ [వ్యాపనము] కొరాటు, నెరపు, నెరవు, నెఱపు, నెఱవు, పంచారము, పటపణి, పరవు, పసరింపు, పిసాళము, పొలపము, పొలయిక.
2.శ[శక్తి] చూ, అలవు.
3.శ(అధికము) చూర అంకపొంకములు
అవఘళించు.1శ.అ.క్రి. (వ్యాపించు) చూ, అవరు.
2—.(సరియగు).
3.శ.స.క్రి.(అతిక్రమించు) చూ, అంగించు.
అవఘళుఁడు.శ[వ్యాపకుఁడు]
అపచాటము .శ.వై.క్రి. విశ[అకస్మికము.] అబ్బాటు, డబ్బాటు.
అవడు.శ[నింద] చూ, అగడారు,
అవతల.1. శ[పారము] చూ, అక్కడ,
2.శ.[పిమ్మట] అవ్వల, ఆవట, ఆల.
అవదగాకి.శ[దుష్టుఁడు] చూ, అడబంప.[ము
అవదాయము,శ.మి. గ్రా [లెక్కవదాయ
అవధారు.శ.వై.గ్రా.ని= [అవధారణమ్, వినుము]
అవదూరు.పా[నింద] చూ, అగడారు.
అవనాయము.శ.వై= [అపన్యాయః. న్యాయములేనిది]
అవమానపడు.శ.మి.అ.క్రి[భంగపడు] ఎడరు, గుల్లపడు, చటులువడు, పాలివోవు, బన్నపడు, భంగపడు, మొక్కచెడు మొక్కపడు, మొక్కపోవు, మొక్కలుపోవు, మోదుపడు.
అవల.శ[పారము] చూ, అక్కడ.
అవమానపెట్టు.శ.స.క్రి.[భంగపఱచు] భంగపెట్టు, లంకించు.
అవలినాడు.ప.౧.౫౩(పశ్చాద్దినతృతీయదినము) ఆవలియెల్లుండి
అవసడి.శ.మి.గ్రా(నింద) చూ, అగడారు.
అవాంత్రము. పా(ఆపద) చూ, అంకిలి.
అవాయి .శ.(ఆకాశబాణము)
అవారి.శ.వై(అపారమ్) అవ్వారి
అవికిరి.పా(రక్తపుచ్చి) ఉల్లిక, నలికండ్లపాము, నలికిరి, నలికిఁచు, నల్లిక, మిండ్రమిడ్ద.
అవిటి.1.శ(వికలాంగుఁడు)
2.పా(అంధుఁడు) కన్నవిటి, కానని వాఁడు, కానరానివాఁడు, గుడ్డి, గ్రుడ్డి, చీకు, రేచీఁకు [అడఁగు
అవియు.1.శ.అ.క్రి(చెడు, నశించు) చూ, అ
3—(భిన్నమగు) "గుండెలవిసె" మొ. కుళ్లు, క్రుళ్లు
అవిరి.1.శ(నీలిచెట్టు) నీలి
2.శ(నేత్రరోగవిశేషము) చూ, అయిర
అవిసి.పా.వై(అతసిచెట్టు) చూ, అగసి
అవిసిను.శ.వై= (అగస్త్యః) —పై—
అవిసె.శ.వై =—పై—.
అవు.శ.అ.క్రి చూ, అగు.
అవున్.శ.అవ్య.చూ, అగుఁ.
అవుగాములు.1.శ (కలిమిలేములు) ఔగాములు.
2.శ[యుక్తాయుక్తతలు] ఔగాములు.
3.(మేలుగీళ్లు) ఔగాములు.
అవుకాఁపు.శ(అర్ధకాఁపురము) ఔకాఁ

అవుఁగద.శ.అవ్య(ఆశ్చర్యార్థకము) చూ,
౪అక్కు.
అవుఁగాక.శ.అవ్య(అట్లైకావి) ఔఁగాక
అవుఁగు.శ(భక్ష్యవిశేషము)చూ, అంగరో
ల్లెలు. [ను.
అవుజా.1.ఖా.౧.౧౫౫(పంకము)చూ,అడు
2.శ(కుల్య)అవుసు,ఓడిక,ఔజు, ఔద
రి, ఔదు, కయ్య,కాలన, కాలువ,కా
ల్వ,క్రయ్య,బట్టె,వంక,వరద,
3.శ(కర్మకారుఁడు)అవుదు, ఔజు,పని
వాఁడు.
అవుదు.పా(క్రిందిపెదవి) ఔదు.
అవుదల.శ(శిరము)ఔదల,తల,తలకాయ,
నెత్తి, నెత్తికాయ, పోలు,సిరము,సిరసు
అవుసు.శ.చూ,౧అవుజా. [క్కు.
అవుర.శ.అవ్య(ఆశ్చర్యార్థకము) చూ,౪అ
అవుసు.శ (వీరణము) చూ,అగురు
అవుల.పా(పారము)చూ,౧ అక్కడ.
అవులు.శ.అ.క్రి.(రాలు).చూ,౧అగులు.
అవురెమ్మ.శ.అవ్య(ఔనాను) అవురే,ఔ
రెమ్మ,ఔరే.
అవురే.శ.అవ్య—పై—. [సు.
అవుసు.1శ.(పొగసు)ఔసు,హావుసు,హా
2.శ(ఒయ్యారము)ఔసు,హావుసు,హా
సు.
అవ్వ.1.శ. వై=(అమ్బా.) చూ, ౧అవ.
2.శ.వై(జననీజనకులతల్లి) చూ, ౧అవ.
3.శ.వై(ప్రాజ్యస్త్రీ)చూ,౩అక.
అవ్వల.1.శ.(పారము)చూ,౧అక్కడ.
2.శ.(పిమ్మట)చూ,౧అవతల.
అవ్వారి.శ.వై=(అపారమ్) చూ, అవారి.
అసడ్డ .శ.వై=(అశ్రద్ధా) చూ,౫అలవోక
అసదు. 1.శ.వై.(అల్పము)చూ,౧అన్నువ.
"అసదు గాను.,,
2.శ.వై(నికృష్టము)చూ,౪అసుగు."సీ.
గాంగేయకుంభజ కర్ణులమిగి లేడుఁగాదే
నిసమఁడగుఁగానియసదు, గాఁదలంపఁ
గరాదు.,,భార.శల్య.౧.ఆ:
అసము.1.శ.వై=(యశః.కీర్తి) కీర్తి,పేరు,
పొగడిత,పొగడ్త,బవిసి,జైసి.
2.శ.(చనవు)మందమేలము.
3.శ.(దర్పము,గర్వము) చూ, ౧అద
టు." చ.అసమునమీఁ దేఱుంగకమ
హోగ్రహుతృత్తిఁగడంగిచెచ్చెరన్, బసు
లకుఁగూయిగాఁజనియెఁబోఁపఁడు."
భార.విరా.౫.ఆ:
అసరలు.పా.(రాక్షసులు) ఎరచిదిండ్లు,గ
రాసులు, తోలివేలుపులు, తోలువేలు
పులు, నంజుడుదిండ్లు,నల్లద్రావుడు
లు,నెత్తురుద్రావుకులు,పొలసులు,పొల
దిండులు,పొలసుదిండులు,పొలసుదిండీ
డులు,మానిసిదిండ్లు,రక్కసీలు, రక్క
సులు,రక్కసలు, రాకాసులు, రేద్రి
మ్మరులు,రేద్రిమ్మరీఁడులు, వేగంటిగొం
గలు, వేలుపుదాయలు,సుకురునిసులు,
సుక్కురాచారిసిసువులు,సోఁకులు, సో
ఁకుడులు. [రించు.
అసరవేయు.శ.స.క్రి.(ఆలస్యముచేయు)వివ
అసరసంజ.పా.(ప్రదోషకాలము) చూ,అ
రసంజ.
అసరసంజె.పా.—పై—.
ఆసరు.శ.(ఆనపసరు)
అసలారు. శ.అ.క్రి.(అతిశయించు)చూ,2
అడరు"ప్రియమసలారఁగ." భార.అ
ను.౧.ఆ:
అసలు.1.శ.(పంకము)చూ,అడుసు.
2.శ.(మూలధనము)ఓలము,బండవలము
బండాలము,మొదలు, సంచిమొదలు.
అసలుఁబుట్టువు.శ.(పంకజము) తమ్మి,తా
మర, నీటిపుట్టుగు,నీరుపుట్టువు,నీరుపు

ట్టు వు.

అసలుకొను.శ.అ.క్రి.(పంకిలమగు)

అసహ్యాపడు.శ.మి. అ. క్రి (రోతపడు) ఈసడించు,ఏవగించు,ఏవపడు, ఓకరించు,ఓకిలించు,కెంకిరిపడు,గోరపడు,రోతగించు,రోయు.

అసాద్ధు.శ.అవ్య.(ప్రశంసనార్థకము) చూ 3అజ్జ.(ఇదిగొప్పవారికుత్తరువునవిశేషయములుమంచిదనియంగీకరించుటయందునచ్చును) చూ,హసాసు''క.బుధులో, సాధనశాస్త్రతువులెల్లన,సాధనజగి జెట్టదొపెరిసాధనసేయున్.,,రామా.3.ఆ:

అసి.శ.ఉప.(అల్పార్థము) ''అసిరోత.'' మె. మఱియుసదియెకొ నొకనొకత్యర్థకముగాఁగానఁబడియెడి

అసిఁబోవు.శ.అ.క్రి.(తప్పిపోవు) ''సీ.అసిఁబోవు బెట్లు నాయసిఁ బోవు మెకములఁజించునా చేయమ్మ చిలుకుటమ్మ.,,రామా.౨.ఆ:

అసిమి.శ. (అల్పగోణీవిశేషము) శబ్దశేషములు. గోతము,గోతాము, గోనెసంచి, మాత్ర,సంచి,సంచీ.

అసిమిగొల్లెన.శ.(ఇరుప్రక్కలవంపుగానేర్పఱచినచిన్నగుడారము)

అసియాడు.శ.అ.క్రి. (చలించు) చూ,ఁఅటమటించు. [ప్రజక్క.

అసిలేరు.శ.నై. (ఆశ్లేషానక్షత్రము) సప్ప

అసివారు.శ(సవారిమార్గము)కసివాండు.

అసివాలు.శ(విహారము)''సీ.ఎవ్వఁడుసలవతేలెక్కయష్టాదశద్వీపాళినసివాలుఁదిరిగెలీల.,,కాశీ.ర.ఆ:ఆరట, ఈరువాలు,చెరలాటము, చెలలాట, చెలగాటము,పచేరము,మలయిక, వయాళి, వయ్యాళి,స్వారి.

అసుసుసుర.శ.(శ్రమమునందగుధ్వన్యనుకరణము)క''. ముసురుకొనుజరభరంబున,నసురుసురైయున్నమమ్మునడకించితివి.,,స్వా,ర.ఆ:=ధ్వన్యనుకరణములశేదములు—. అస్సుగు, అవురు,ఇహీహీ,ఉసుక్కు.ఉచ్చిచ్చిరే, ఉల్లల,ఉసురుసుర,ఉసుసు, ఉస్సు,ఉస్సురస్సురు,ఉస్సురు,ఉసూరు,కంగు,కచుక్కు, కటకట,కటపెట,కటుక్కు,కతిల్లు,కతుక్కు,కనకన,కరకర, కఱకఱ,కఱుక్కు,కలకల,కలుక్కు,కళపెళ,కసక్రస, కొంద్రు,కొవు,కికకిక, కెకాకక,కిచకిచ,కిటకిట,కిఱకిఱ,కిల్లు,కిలకిల, కిసకిస,కిసాలున,కీఁచు,కులకుల,కుతకుత,కే,కొక్కొరొకో,కొక్కొరోకో,కో,కోవు, క్రంగు,క్రియో,క్రేవు,ఖంగుఖింగు, గడగడ,గణగణ,గణిల్లు,గనగన, గబీలు,గమగమ,గమ్ము,గఱగఱ,గట్టు, గలగల, గల్లు,గళగళ, గళ్లుగళ్లు,గింగురు, గిజగిజ,గిటగిట,గిరగిర,గిఱుక్కు, గిల్లు,గిలుకు,గుటగుట,గుడుక్కు,గుడుగుడు, గునగున, గుప్పు, గుబగుబ, గుబ్బు, గుమగుమ, గుమ్ము, గుఱగుఱ, గుఱుగుట్టు, గులగుల, గొటగొట, గొణగొణ, గొఱగొఱ, గొలగొల, గొండుర్రి,గోలుగోలు, గొల్గొలు, చంగు, చకచక,చటాలు, చటిల్లు, చరచర, చిటచిట, చిటపొట, చిటాలు, చిటుకుపొటుకు,చిమచిమ, చిలచిల, చిల్లు, చివచివ,చివుకు, చివుక్కు, చుంయి, చుచ్చు, చుఱచుఱ, చుఱుకు, చుఱుక్కు, చుట్టు,చొటచొట, చొదచొద, చొఱచొఱ, జగ్గు, జఱజఱ, జలజల, జల్లు, జవజవ, జవుజవ్వు, జొజవ్వు, జిఱ, జిఱజిఱ, జిట్టి, జిట్టు , జిల్గు, జివ్వు, జివ్వురు, జుం, జుంజుం, జుఱు కు,జుట్టు,జువ్వ,

ఆకుతేలు.పా—పై—
ఆకుదోఁట.పా(నాగవల్లీకారామము)
ఆకుపచ్చ.శ(హరితవర్ణము)పసుపు
ఆకుపత్రి.శ(ఒకానొకచెట్టు)
ఆకుపాఁచి.శ (ఒకదినుసుపాఁచి,కుంభిక)
ఆకుపీఁకలు.శ.బ(బాలక్రీడావిశేషము) చూ,అంపలములు
ఆకుపురుగు.శ(శలభభేదము)ఆకుమిడుత
ఆకుపోయు.శ.స.క్రి(నాటుపోయు) [ప్పు
ఆకుప్పు.శ(ఒకదినుసుకుప్పు)చూ, అంటు
ఆకుబట్ట.పా.చూ,ఆకుచుట్ట [మడుపులు
ఆకుమడుపు.పా(వృక్షపర్ణము)మడుఁగులు
ఆకుమిడుత.శ.చూ,ఆకుపురుగు
ఆకుటాయి.శ(పత్రిపరశువు)
ఆకులపడు.శ.మి.అ.క్రి(ఆకులతనొందు)
ఆకులపాటు.శ(ఆకులపడుట)
ఆకుసంబెళ.పా(తాంబూలదాని)చూ, ౧ అడపము
ఆకుసన్నములు.శ.బ(ధాన్యవిశేషము) చూ, అక్కుళ్లు.
ఆకె. శ. స. ఏ (తత్స్త్రీ) ఆపె, ఆవిడ, ఆవిడె, ఆమె, ఆయక, ఆయప, ఆయమ, ఆవిడ
ఆఁకొంట.భా.౨.౨౬౦(క్షుత్తు)చూ,౬ అంగద
ఆకొను.శ(పూఁగదళని)చూ,అపకతు
ఆఁకొను.శ.అ.క్రి(ఆఁకటఁజెందు)
ఆకొన్నవాఁడు. భా.౩. ౭ (క్షుధితుఁడు) చూ,ఆకసైనవాఁడు
అగడకాఁడు.శ (అకార్యము చేయువాఁడు)అగడీఁడు
అగడపలు.శ(మేఘపరంపరలు) అడెపలు, అడెపలు, అడెలు, మొగిలుదొంతికలు
అగడము.1.పా(అపరాధము)చూ,అయిపు
2.పా(ప్రతికూలము)

అగడీఁడు.శ.చూ,అగడకాఁడు.
ఆఁగాఁకర.శ.చూ,అడవికాఁకర
ఆగాడి.శ(తేలికైనధాన్యము)
ఆగాత్యము.శ.వై.(కొంచెమునుగొప్పగాచేసికావించెడుఅలవు,ఏమ్పులోనగునది)
ఆగు.1.శ.స.క్రి(నిరోధించు)చూ,అంకిలిపెట్టు
2.శ.అ.క్రి(ఉపశమిల్లు)చూ,అడఁగారు
3.శ.స.క్రి(నిషేధించు)"గీ.ఆఁగఁబడినవానిలోఁగఁగఁజేయుట, యుధమగతికిమార్గమనిరిబుధులు,, భార.ఆది.౩అ:
4—(మోచు)"భారమాఁగఁజాలక" భాగ.౧౦.స్క-౦.
5—(బాధలనుతొలఁగించి రక్షించు) కాపాడు,సాఁగు
ఆగుబ్బాలు.శ.అ.క్రి(అతిశయయించు)చూ ౭అడరు"మదిలోనికోర్కె—లాగుబ్బతిలంగ,, స్వా.౨అ:
ఆగుబ్బు.1.శ(అతిశయము)చూ,౧అగ్గలము
2.శ(అధికము)చూ,౪ అంకపొంకములు.
ఆగుబ్బుకొను.శ.అ.క్రి(అతిశయించు)చూ, ౮అడరు"సీ.ఒకపంకజాలసముద్భూతసుమజాతఘుమఘుమ మామోద మాగుబ్బుకొనంగ,, శే.౨అ:
ఆచక్కి.పా(ఆస్థానము);చూ,౧ అక్కడ
ఆఁచికొను.. శ. స. క్రి(అపహరించుకొను) చూ,౪ అంకించు"సీ. పురిలోపలఁజొచ్చివిస్ఫురితగేహంబుల యర్థసంచయమును నాఁచికొనుఁడు,, హరి.ఉ.౬అ:
ఆఁచు.శ.క్రి(అణఁగించు)ఆఁపు
ఆచూకి.శ(పోబడి,జాడ)ఇక్కువ, ఈగడ. కందువ, కన్ను, చాయ, చూచాయ, చొప్పు, జాడ, తాపి, తావి, పత్తా, పొరువ, పులుగు, పొలకువ, పొలము,

6—.(నాటు) "క. తోడనహాయమమ తులనో, నాడఁగ సేయుటకానతఁ డున లిగి.,, భార,కర్ణ, ౨.ఆ: ఊదుకొను, కొఁడు,కీలుకొను,కొను,గ్రుచ్చు; చెరు వు,తొట్టు,నాటు,నాడు, పనుపడు,ప న్నుపడు,పెట్టు,మొలవేయు.

7—.(విహరించు) "సీ. వాహ్యాళిభూ మిరేసంతనైన ధులట్లు హాయురన్ములనె క్కియాడ నేర్చె.,,భీ.౧.ఆ: చెరలాడు, పరఁగు,మలయు.

8—.(సంచరించు) "గీ.అడరిసహసేన పైగ్రద్దలాడఁ జొచ్చె.,, భార. భీష్మ.3 ఆ:క్రుమ్మరిలు,క్రుమ్మరిల్లు, క్రమ్మరు,చి ట్టాడు, చెరలాడు,తారు, తిరుగాడు, తి రుగు,తిరువు,తిగ్గు,క్రమ్మరు, నడయాడు, పొలయు,పొలసాడు,పొలసియాడు,మ ట్టాడు,మలఁగు,మలయు, మిట్టాడు,మి డుకు,మెదలు, మెలఁగు.

9.శ.స.క్రి(వచించు)చూ,౧ఆస.

10—.(నడపు) "జూదమునీతో నాడఁ గడఁగెదను.,, భార.అర.౨.ఆ:

11 —. (నవ్వులలోనగునవిగానుగ లోవేసిత్రిప్పు)

ఆఁడుకట్టు.శ(ఆఁడుదానికోఁ కకట్టు)" కాళ్లయొప్పినమాఁడుకట్ట నుజ్వల ము చేయంగ.,, (ఇక్కడ ఆఁ డుకట్టనఁ గాఆఁడుదానికోఁకకట్టువంటికట్టనిఅ ర్థము)విరా.౧.ఆ:

ఆఁడుకూఁతురు.శ(స్త్రీ) చూ,అతివ.

ఆడుకొను.శ.స.క్రి (నిందించు) చూ, ఆడి పోసికొను.

ఆఁడుతోఁడు.శ (భగిని) తోడఁబుట్టు,తో డఁబుట్టుగు,తోడఁబుట్టువు,తోడిమా లు,తోడు,తోఁబుట్టినది,తోఁ బుట్టు, తోఁబుట్టుగు,తోబుట్టువు.

ఆఁడుది.శ(స్త్రీ)చూ,అతివ.

ఆఁడుపడుచు.శ.(పుత్రిక) "సీ. కొడుకును న్నఘుఁడాఁడుపడుచుభాగీరథియిల్లాలు భూకాంతయిల్లుకొండ.,, రా.వి.౨.ఆ: ఆఁడుబిడ్డ,కన్నియ,కన్నె,కన్య,కుమా రిత,కూఁతు,కూఁతురు,కొమరిత, కొమ రె,కొమారి,కొమారిత,కొమారితె, కొ మార్త,కొమార్తె, పట్టి,బిడ్డ, బిడ్డె,బొ ట్టియ,బొట్టె, మేపుట్టువు.

ఆఁడుపాప .శ (కన్య) చూ, అమ్మాయి.

ఆఁడుపుట్టువు.శ (స్త్రీ)చూ,అతివ.

ఆఁడుబిడ్డ.1.శ(పుత్రిక) చూ,ఆఁడుపడుచు

2.శ(మగనితోడఁబుట్టినది)

ఆడువరి.శ(వప్రము)చూ,అలంగము.

ఆడె.1.శ(కడితమునందుఏకదేశము)

2.పా (ధాతకి) ఆరె, [illegible] పువ్వు, ఏలు జాజి. [illegible]పలు.

ఆడెపలు.పా(మేఘపరంపరలు) చూ,అగ

ఆడెబలు.ప.౧. శరె—పై—.

ఆడేలు.1.పా—పై—

2.శ.వై= (ఆటిః.శరారిపక్షి) ఆడేలు, బాతు,బాతువు.

ఆడేలు.1శ.వై=(ఆటిః) చూ,అఆడేలు.

2.పా(బకము)ఆకాశపక్కి, కొక్కరా యి,కొక్కెర,కొంగ,తెల్లకంటి,పర డ,బాతు,నక్క,నక్కపులుఁగు,నగ్గట ము,వాలుకొంగ.

ఆణి.1.పా(రథాక్షసంధానితకీలము) చిలు క,చీల,జంజడ,మొల.

2.శ(ముత్యపుగుండ్రఁదనము. మౌక్తిక విశేషము)కట్టాణి,తారము,సుప్పాణి.

3.శ (మర్మము)చూ,అనవులు.

ఆణికాఁడు.శ(మల్లుఁడు)

ఆణిపూస.శ(మౌక్తికము) "సీ.వేణు జాత ములైన యాణిపూసల కెంతురూడుగ

వారు )

ఆదుకొను.1.శ.అ.క్రి.(ఆనికయగు)"ఆదుకొన్న కావరమున,, రాఘ.౪. ఆ:ఆను, ఊను,మోచు

2.శ.స.క్రి(ఆదరించు)"క.అనిశము సిరులం,బాదుకొని నృపతిలకం,బాదుకరాఁ బెరుగుమం డెనంతఁగడంకన్,,రుక్మి.౧.ఆ:అలకించు,అలించు, కొనియాడు,గారవించు,చేకొను,పాటించు,మన్నాడు,సంబాళించు

ఆఁదోఁక.1పా(గోవాలము)

2.శ(గోవాలాకృతి)

ఆఁదోఁకపాటు.శ(అవుతోఁకపలెనగుట, ఆఁదోఁకపడుట)

ఆన.శ.వై=(ఆజ్ఞా)చూ,అప్పణ

ఆనతి.శ-వై=(ఆజ్ఞప్తి)—పై—

ఆనతిచ్చు.శ.స.క్రి(పూజ్యులుపచించు)ఆనతియిచ్చు

ఆనతియిచ్చు.శ.స.క్రి —పై—" మోక్షము తెరువానతియీవే,, భార. శాం.౪. ఆ:

ఆనపకాయ.చం(సొరకాయ)

ఆనవాలు.1శ(చిహ్నము) చూ,అంకనము.

2.శ(ఇవురఁగాఁచినపాలు , కూర్చిక) "సీ.పాలఁబోల్ పయసునీపాలుసేయుటకిదెయానవాలన్నట్టు లానవాలు,,శశాం.౩.ఆ:ఆనాలు

ఆనాది.శ (కిరాతవిశేషము) చూ,ఆకరి.

ఆనాలు.శ.చూ,ఆనవాలు.[కూర్చికకు:— "జున్ను వెన్నయిడియానాలు క్కెరల్ చక్కెరల్, ఫలముల్,, రాజశేఖరచరిత్ర]

ఆనిక.1.శ(ఉపాశ్రయము)చూ,అండ.

2.శ (శక్తి)చూ,తిఅలవు.

3.పా(పానము)త్రాగుడు, త్రావుడు

ఆనియ.శ(దద్రురోగము)చూ,తణీయ

ఆను.1.పా.(మర్మము) చూ,అనరులు.

2.పా.(మొదలు, మూలము)మొదలు

3.శ.స.క్రి(భుజించు)"ఉ.తేనెలుగ్రోలి క్రోలికడుఁదియ్యనికమ్మని పండులింపుసొం,పానఁగనానియాని,, భార.అర.౬.ఆ:ఆరగించు,ఆరోగిణమొనర్చు, కుడుచు,కుడ్చు,క్రోలు,తిను,నంజు,నములు,నములు,పసాదపడు,బోనేయు, మెక్కు, మెసఁగు, మెసవు,సాపడు.

4.భా.స.క్రి.౩.౧౨౦(నిరోధించు) చూ, అంకిలిపెట్టు

5.శ.స.క్రి(పానముచేయు)"పాపాణామృతంబానఁగఁజేసెనాచెవుల,, భార. అను.౧ ఆ:ఆరగించు,కుడుచు, కుడ్చు, క్రోలు,త్రాగు,త్రావు, త్రెక్కొను, నిముచు

6—చూ,అనుము-,, మోఁ కొట్టు, వక్షస్స్థలంబునదాని-,, కళా.౩ ఆ:

7—(అంటుచు)" అనఁగనానికోపము న.,,కా.౨.ఆ:

8—.(ధరించు)"మోహప్రకటనమానితన్ననిచిన ,, హన.౨ ఆ:చాటు,తాలకొను,తాలుచు,తాల్చు, తొడుగు,తొడువు,తొడ్గు,పాటించు,పూను,పెట్టు, సంతరించు

9.శ.అ.క్రి.(ఆనికయగు)చూ,ఆనుకొను" ఇంపుసొంపానఁగనానియాని,, భార-అర-౬ఆ:

ఆనుకట్టు-శ(ఊనుకొనెడుకట్టు) ఊతకోల, పట్టుఁగొమ్మ

ఆనుకొను.సాం.౨౭.స. క్రి (నిరోధించు) చూ, అంకిలిపెట్టు

ఆనుగ.పా.వై(ఆలాబువు)ఆనుగము,ఆనుగు,సొర,సొఱ, సొఱ్ఱ

ఆనుగము.శ.వై—పై—

ఆనుగు.శ.వై—పై—

ఆనుకుబిల్ల.శ(ఉపధానము)ఒరగు,ఒఱగు, ఒఱగుబిల్ల,ఒఱగుబిళ్ల,ఒఱుగు,తలగడ, తలయంపి,తలాటి,తలాడ,తలాఁడు, తలాఁపి,తలాఁపు,తల్లడ,తల్లపి, దురాడము,బాలీసు,బిల్ల,లోడు

ఆనువు.శ.(ఆశ్రయము)చూ,౧ఆండ"జానువునానువుననదిమియుంగదిమియు.,, ఉ.హరి.౬.ఆ:

ఆనె.శ.(దద్రురోగము) చూ,ఆణియ

ఆపసోపాలుపడు.శ.అ.క్రి.(ఉస్సురస్సురను)

ఆఁపు.1.శ.(నిరోధము) చూ,౪ .అంకిలి "గీ.పట్టుకొనిమాపు సేయించె బాణుండతని,,అని.౩.ఆ:

2.శ.ప్రే.చూ,ఆఁచు.

ఆపె.శ. స. ఏ.చూ,ఆకె.

ఆపోసనము.శ.వై=(ఆపోశనమ్)చూ, ఆపోసానము.

ఆపోక.శ.(తృప్తి)చూ,౩.ఆపట

ఆపోవు.శ.అ.క్రి. (తృప్తిపడు)చూ,ఆపటవోవు

ఆబ.శ.(తారకము) "వానియాబలుం గెను.,, కంటిపాప

ఆబలు.పా.బ.(సగ్గుబీజములు)ఆనగింజలు, ఆవలు,అవాలు,సాసువులు.

ఆఁబడ్డ.పా.(వత్సము)ఆఁబెయ్య, క్రేపు, దూడ,పెయ్య,పేయ,లేఁగ

ఆఁబసి.శ.(గోవు)"సీ.బలుదానులగుచు బెబ్బులులబిడ్డలనిచ్చివిసువక పెంచునాఁబసులకదుపు.,,య.౨,ఆ: ఆవు, కుట్టి,గిడ్డి,తొడుసు,తొట్టు,పయిరము,పసులు, పెయ్య,పేయ,పైరము,మొదవు, లేఁగటియావు.

ఆబిడ.శ.స. చూ, ఆకె.

ఆబిడె.పా.స.—పై—

ఆబూతి.శ.వై=(ఆభుక్తి)పెనుదిండి

ఆబూతికాఁడు. శ. వై(భక్షకుఁడు)తిండికాఁడు,తిండిపోతు,తిండీఁడు,బొంగన గొండి,మేఁతరి,మేపరి.

ఆఁబెయ్య.పా.(వత్సము) చూ,ఆఁబడ్డ.

ఆఁబోతు.1.శ.(వృషభము)"అంకివేసెనొకచోనాఁబోతుకొమ్ముదువ్వచుకా ,,పంచ.నా.౧.ఆ: అలపోతు, అలకేఁడు, ఎద్దు,ఎద్దు,ఎల్లు,గడిపోతు, గిత్త,గిబ్బ, గిబ్బటీఁడు,గోణి,గోద, పోతు, బసవఁడు,బసవన,బసవన్న ,ముడిగిబ్బ.

2.శ.(గోపతి)చూ,అచ్చుకెద్దు

ఆఁబోతురవుతు.శ. (శివుఁడు)చూ, అంగములవేల్పు

ఆఁబోతుసారము.శ(సప్తస్వరములలోనొకటి) [నము)

ఆమడ.శ. (నాలుగుకోసులదూరము,యోజ

ఆమంత్రి.పా.వై=(ఆమంత్రణమ్- ఆహ్వానము) ఆమంత్రింపు,ఆమెంత,ఆమెంత్రి, ఆమెంత, కైసన్న,చీరుడు,పిలుపు,పిలుపుడు.

ఆమంత్రింపు.పా.వై —పై—

ఆమంత్రించు.1.శ.వై.స.క్రి(ఆహ్వానించు)చీరు,పిలుచు,పిల్చు,పేరుకొను పేర్కొను

2—(పూజించు) కయిసేయు, కైసేయు,పూజించు.

ఆమత్రిల్లు.శ.వై.అ.క్రి.(జన్మించు)చూ,౯ఆమెరు" ఇంపామత్రిలంగనిల్చి,,య ౧ఆ:

ఆమని.1.శ.(వసంతఋతువు)ననకారు,పూఁదఱి,మండునెల.

2.పా.(గ్రీష్మఋతువు)విసరి,వెట్ట,వెట్టకారు,వెట్టకారు,వేసఁగి,వేసవి.

3.పా.(ఉత్సవము)"చూపరకుం బేరామనిగానామనియొప్పెనంత,,య:ఆమె

త,తర్ధా,తిరునాళ్ల,తిరునాళ్లు,పండుగ,
పండుగు,పండువ, పండువు,పబ్బము,ఫ
రువము,అంతు, సంబరము, సంబ్రము,
సాకము.
4.శ(ఫలసమృద్ధి)
5.(సమృద్ధి)ఒదుగు, ఒదుగుబడి, ఒదు
వు,ఒద్దియ,ఒద్ది,తామరతంపము,తామ
రతంపర,తామరదంపము, తోరహత్తు,
దండి,నింపాది,నింపు,నిసువు, పస,పసి
క,ప్రంజి,పెంపు,మస్తు,సంపు, సొంపు,
6.పా (పండినపంటయొబ్బిడిచేయించె
డితావు)
ఆమము.పా(కుమ్మరావము)ఆవము.
ఆమవస.శ.వై(మెంతిపెరుగులోనేనిగారె.
భక్ష్యవిశేషము)చూ,అంగరొల్లెలు.
ఆమిక.శ(మదము)చూ,తిఅదటు.
ఆమిరె.పా.వై(ఆహ్వానము)చూ,అమరె
ఆమిశి.పా.వై—పై—.
ఆము.1.భా.౧.౧౩౩. (గర్వాధికము)
2.శ(మదము)చూ,తి.అదటు. ను)
ఆముకవిము.శ.అ.క్రి (మిక్కిలిక్రిక్కుమ్మక్కొ
ఆముకొను.శ.అ.క్రి (పైకొను) "అముకొ
న్న క్షేమచేనసుసుసునుచు.,, క్షేత్ర
య.
ఆముదపుచెట్టు.శ(ఏరండపము) [ము.
ఆముదము.శ (ఏరండతైలము) దివ్వెనము
ఆముదములు.శ.బ(ఏరండబీజములు)ఆము
దాలు.
ఆముదాలు.శ.బ.—పై—(ఏదినాడుక)
ఆమె.శ.స.ఏ.చూ,ఆకె.
ఆమెల.1.పా.వై(ఆహ్వానము) చూ, అవ
రి. [ని.
2.వెం.తిశ.వై.(ఉత్సవము)చూ,వెలసు
3.శ.వై.(మనుష్యసమాజము)"ఎ.గీ.మే
టితుమ్మెదగములకానెసు తలుపెట్టు."

రసి.ర.అ: విందు.
ఆయక.శ.స.చూ,ఆకె
ఆయకట్టుశ.మి.గ్రా.(ధనమువచ్చు బడియొ
క్క నిర్ణయము)
ఆయకము.శ(అధి)చూ,అగావు.
ఆయకాండు.శ.మి.గ్రా (కరణములో నైన
ఊరి యుద్యోగస్థుడు)
ఆయతము.పా.వై(యత్నము,ఉద్యమము,
ప్రయత్నము)ఆరంబము,ఉంకింపు,ఉది
యు,ఉద్దియ,ఉవ్వు,ఊకసు,ఊకసువ,ఎ
త్తనగోలు,ఎత్తుకోలు,ఎత్తు,ఎత్తుగడ,ఒ
డుపు,ఒడ్డు,కడంక,కడెక, కడక,క
దలిక, కదలు, గమకము, జతన,జతన
ము,జతను,తల,తలపాటు, తాగసము,
తూకము,తూపు,తొడసు, తొడరువు,
నెట్టు,పూనిక,పూనికి, పూన్కి, పూన
పు,బోగు,మని,మనుకువ,మేకోలు,మే
గలి,మొగి,మొనపు,సడ్డకట్టు,హంరా.
ఆయతి.పా.(క్వాసాదిమాసచతుష్టయము)
కందాయము,కొలు.
ఆయతికాండు.శ.మి (ధనార్జనము చేయు
వాడు)"క.ఆయతికాండును లయనర
నాయకునను.,, భార.శాం.తి.అ:
ఆయది.శ.స.చూ,అది.
ఆయన.శ.స.చూ,అతగాడు.
ఆయప.శ.స.చూ,ఆకె.
ఆయపటము.శ.వై.(సాగుదెయు)
ఆయమ.శ.స.చూ,ఆకె.
ఆయము.1.పా(అశ్వశాల)పాగ,పాగా,
మందడి,లాయము,సాహిణము. [లు.
2.వై.(జీవస్థానము,మర్మము)చూ,అనవు
ఆయల్లి.ఆ.(వాత్సల్యము) చూ, ఆరులు
ఆయలె.శ.అవ్య.(అనాదరమును తెలిపెడి)
"చ.వసంతుడు తాడయునేసె గాక
యా, యలెనిజశక్తినా యనుచునాపస

కుంగొదవెట్టెపెసీకునన్ ."ఆము.౫.ఆ:
అయవారము.శ.వై= (యాయాచరః.ధాన్యయాచన, భిక్షు)చూ, అడుగుకోలు. [అలగు
ఆయాసపడు.శ.మి.అ.క్రి(శ్రమపడు)చూ,
ఆయాసపాటు.శ.మి(ఆయాసపడుట)
ఆయాసపెట్టు.శ.మి.స.క్రి(శ్రమపఱచు)
అయిటీ.శ(శాల్మలి*)బూరుగ,బూరుగు
ఆయితపడు.శ.అ.క్రి (సిద్ధమగు)ఆయిత్తపడు,సంతనకట్టు. [టు.
ఆయితపాటు.శ(సిద్ధమగుట)ఆయిత్తపా
ఆయితపెట్టు.శ.స.క్రి(సిద్ధము చేయు)
ఆయితము.1.పా(సన్నాహము) అయితము, కిట్టాయితము, కోలుతల, కోల్తల,ముస్తాబు,ముస్తీను, ముస్తీబు, సజ్జ, సమకట్టుట
2.శ.విణ(సిద్ధము)చూ,3అలవాటు "గీ.వికచవృందయుఁదైతలచీరయాయితము చేసి,,భార.విరా.౨ఆ:
ఆయిత్తపడు.శ.అ.క్రి. చూ, ఆయితపడు
ఆయిత్తపాటు.శ.చూ,ఆయితపాటు.
ఆయిత్తము.చూ.ఆయితము
ఆయివారము .పా.వై (ధాన్యయాచన,భిక్షు)చూ,౨అడుగుకోలు. [అందన్.
ఆయెడన్.పా.అవ్య (తత్రార్థకము)చూ,
ఆర.శ.అప.(సంబోధనమునందువచ్చెడి ఆగమము)"రాములార.,, [క్రి-)
ఆరంగపుపక్క.శ (మేలగుఒకవిధమైనచే
ఆరంజోతి.శ.వై=(అరుంధతీ)
ఆరంబము.పా.వై=(ఆరంభము,ప్రయత్నము)చూ,ఆయితము
ఆరకాటి.శ (నావికుఁడు) ఓడంగి,ఓడవాఁడు, కర్ణకారుఁడు,చెంబడివాఁడు,తండెలు, తండేలు, పీలికాఁడు,మరకాఁడు,మాలిమి,మాలిమికాఁడు, రేవుబో
యు,సరంగు
ఆరగించు.1.శ.వై.స.క్రి=(ఆహారః, భుజించు)చూ,3ఆను
2—(పానముచేయు)చూ,౫ఆను"శ్రీరఫూరములారగింతురచట,, శేష.3 ఆ:
ఆరగింత.పా(భోజనము,ఆహారము, భుక్తి)ఆరగింపు,ఆరోగణము,ఆరోగింపు, ఎర, ఎఱ, కుడుపు, గాలి,తిండి, పసదనము, బాతు, బుత్తి, బూతి, బోనము, మెసవుట, సాపాటు
ఆరగింపు.శ—పై—
ఆరఁగూరుట.పా (లెస్సగానగుట)
ఆరజము.1.శ(ఇంపు)ఇమ్ము,ఒనరు,నసుపు, నెయ్యమి, నెయ్యము,పొనరు
2.శ(కలధ్వని)చూ,అంబలము" ఎ.గీ. పావురములారజంబులువలుకుచోట." స్వా.౩.ఆ:
3.శ (కలము)" రగడ.ఇంతిపావురపు రొదయేలవినెదారజము.,,స్వా.౫. ఆ:
4.శ.(మనోజ్ఞము,మంజులము)చూ, ౨అందము"సీ. పైకసదల్చి యారజపుఁ బైఁటఘటించియది మేలో యిది మేలో యనుచునడుగు,,శశాం. ౨ఆ:
ఆరట.పా.చూ,ఆసివాలు .
ఆరము.1.శ (సంతాపము)చూ,.౨అక్కజము."క.పటునఖరశైత్యముననా, రట ముడిపికురారి నేలుసకు స్పృశింపుఁగా,,పాండు.౫.ఆ:
2.పా(విరహవ్యసనము)
ఆరటపడు .శ.అ.క్రి(తపించు,పరితపించు, సంతాపించు)ఆరటించు, ఆరాటించు, ఉత్తలపడు, ఉడికిల్లు,ఉడుకొందు,ఉడుకు,ఉదిరిగొను,ఉదిలగొను,ఉరియు, ఎరియు,కందు,కమల్లు, కాఁగు,క్రాఁగు,గోవరువోవు,తనుకు,దురపిల్లు,దూప

టులు,దూపటిల్లు,దూపించు,దూపిలు, దూపిల్లు,పొగులు,పొవులు,ప్రేలు,మం డు,మండ్రాడు,మఱుంగు,మలయు,మ ల్లడిగొను,మిడుకు,మిడుమిడుకను, ము నుకు,వందు,వడగొను, విచారపడు, వె చ్చు, వెమ్ము, వేఁగు, వ్రేఁగు.

ఆరటపాటు.శ(అరటపడుట)

అరటపెట్టు.శ.స.క్రి (సంతాపింపచేయు)

ఆరటించు.శ.అ.క్రి.చూ,ఆరటపడు.

ఆరడము.శ (పూనిక,ఉత్సాహము)చూ, 3 అంగద"క.వెలివాఱు నుగాలుసలును, వలలుఁదెరలుదీమములు ను,వడిఁ దీరిన ను,కృ_లునారెగోలలునునుం, డల్క్రో వులువేఁటకారడంబులు పెనుపన్,,ఉ. హరి.౪.ఆ:

ఆరడి.పా(నింద)చూ,అగడారు.

ఆరణపక్కి.పా(బకము)చూ,అడేలు.

ఆరతి.శ.వై=(ఆరాత్రికమ్.హారతి)ఆర్తి, ని వాళి,నివాళిక,నివ్వాళి,నివ్వాళిక, హా రతి.

ఆరబము.శ.వై (సస్యము)"కీడునన్ వానల్ కల్గక మానెనారబములెండంజొచ్చె" వి.పు.౬ఆ:పయిరు, పైరు, సస్సి, సస్సి య, సస్సెము [అరయు

అరయు.1.శ.స.క్రి(అన్వేషించు) చూ,గ 2—(విచారించు)చూ,౨అరయు

అరయుట.ప.3.3౯(అన్వేషణము) తడవు ట, తడవుడు, నెమకుట, నెమకుడు,ప రికించుట, రోయుట, వెదకుడు, వెను కుట, వెనుకుడు, వెన్కు_డు

ఆరాట.భా.౧.౪౦(సంతాపము)చూ,౨అ క్కసము.

ఆరాటము.శ—పై—.

అర్రాటించు.శ.అ.క్రి.చూ,ఆరటపడు."బా ష్పపూరములొప్పు_న్మడి కన్ను లందొ రఁగనారాటించుకొ,,వి.పు.౧.ఆ:

ఆరాము.పా (ఉద్యానవనము) చూ,౧.అ టతోఁట.

అరికెలు.పా.బ(క్షోద్రవములు)అరుకలు,అ రుగలు,అళ్లు,ఊటకల్లు. [తోఁట

అరియము.పా(ఉద్యానవనము) చూ,అట

అరివేరపుఁదపని .శ.వై (నారదుఁడు) క య్యపుఁదిండి, కలనతపసి, పోరుదిండి, పోరోగిరపుదంట, పోరోగిరపుదిండి, ముల్లయతి,వేలుపుజడదారి

అరివేరము.1.శ(క్షోభము) చూ,3అంకిలి 2.శ(వైరము)చూ,3 అంకపొంకములు 3.శ(కలహము)అశ్వోరము, కచ్చియ,క చ్చె, గొడవ, చిదగొద,చివ్వ,జగడము, జగ్గు,తంట,తంటా,తంపి,తగవు,తగువు, పోరాట, పోరిగము, పోరు, బకేడా, మారాటము,మాటాట,మాటాటము, ముడి,రచ్చ

ఆరు.1.శ(రోమావళి)నూఁగారు 2.భా.3.౨3.అ.క్రి(ఒప్పు)చూ,3ఆడరు 3.శ.అ.క్రి(నిండు,పూర్ణమగు)"విప్రుల కునాహారంబపూ పాజ్య పూర్వక మైత ద్దయుఁ దృప్తిగాఁగమనసారం బెటి,, భో3.ఆ:జొబ్బిలు,జొబ్బిల్లు, తొట్టు,దీ టుకట్టు,దీటుకొను,నిండఁబడు,నిండా రు,నిండు,నిండుకొను,నినుపారు, నివ్వ టిలు,నివ్వటిల్లు,నెరయు, నెఱయు, పి క్కటిలు,పిక్కటిల్లు,పూడు,పూరగిల్లు, పూరటిల్లు,బూరటిలు,బూరటిల్లు, మెం డుకొను

4.—(కలుగు,జనించు) చూ,౯ అవరు. ఉ.కర్ణుఁడా,భూరమణున్ వడిన్ గదిసి భూరిశరంబులు మేననింపనో,వ్వారుట యుంఆొలంగెనతఁడు,,భార.కర్ణ. 3ఆ:

ఆరుకలు.పా.బ.చూ,అరికెలు

ఆరుగలు. పా బ. చూ, ఆరికెలు
ఆరుచు. 1. శ. ప్రే (అడించు) అర్చు
2. శ. ప్రే (విసరు)
ఆరుమాఱు. శ. చూ, అల్లరి
ఆరుదొండ. శ. వై (తుజాలకము*)
ఆరుద్రపురుగు. శ. వై (ఇంద్రగోపము) పట్టుపురుగు, పసిఁడిపురుగు.
ఆరుపు. పా (ప్రణాదము) అర్పు, అఱపు, గీపెట్టు, పొబ్బెట్టు, బొబ్బ, బొబ్బరింత, బొబ్బాటము, బొబ్బెట్టు.
ఆరుపోరు. శ. (ఎడతెగని కలహము) ఎసళ్ళు, క్రందుకయ్యము, దండడి, దొమ్మి.
ఆరుమూఁడు. పా. (వైకల్యము) అఱుమూఁడు, గచ్చువిచ్చు.
ఆరెలు. పా (అరిగదుబ్బులు)
ఆరె. 1. శ (ధాతకి*) చూ, ౨ఆడె
2. పా (మహారాష్ట్రుఁడు) మరాటి, మరాటివాఁడు, మరాటీ.
3. పా. అవ్య (ప్రశంసనార్థకము) చూ, ౩ అజ్జ. [ది]
4. శ. వై = (ఆరా. చెప్పులుకుట్టెడుసూ
5. శ వై = (ఆరా. బాణవిశేషము) "వ. పేరెలమిం దలపడినవీరులనారెలంజీఱినాలులువోసినట్లుచేసియు,, ఉ. హరి. ౬ఆ:
ఆరెకుఁడు. శ. వై (ఆరక్షః) కావలికాఁడు, కోలుకాఁడు, గస్తీలు, చేరువకాఁడు, తలవరి, తలారి, బంటు
ఆరెగోల. పా (తోత్రము, ప్రాజనము) బరి, బరిగోల, ముద్దిఁకట్టె, మునికోల, ములుకోల, ముల్లుకోల, పరియ, సాటి, సిడులు, సిళ్లు
ఆరెపువ్వు. పా (ధాతకి*) చూ, ౨ఆడె
ఆరెబొట్టె. శ (కోడిపుంజుకాలి యందలి యంగకము)
ఆరెము. 1. శ. వై (ఆరామః. ఉద్యానవనము) చూ, ౧ఆటతోఁట
2. శ (భాషావిశేషము) చూ, ఆఱవము
ఆరెవడ్లు. శ. బ (సూదులవంటి తోఁకలుంగల ఒకదినుసువడ్లు) చూ, అక్కుళ్లు
ఆరోగణము. పా. వై = (ఆహారః, భుక్తి) చూ, అరగింత
ఆరోగిణము. శ. వై = (ఆహారః) — పై —
ఆరోగిణమొనర్చు. సా. ౨. ౨౧. స. క్రి (భుజించు) చూ, ౩ఆను
ఆర్చు. 1. శ. అ. క్రి. చూ, ౩అఱచు "ఆర్చెజనంబఖిలంబునుబ్బునన్,, భార. అశ్వ, ౩అ:
2 — (యోధులుబొబ్బరించు)
3. శ. ప్రే. చూ, ౧ అరుచు.
4. శ. ప్రే (అఱజేయు)
ఆర్తి. శ. వై. అరతి.
ఆర్ద్రము. శ (అఱుతూములు) అర్ద్రము.
ఆర్పు. 1. పా (ప్రణాదము) చూ, ఆరుపు.
2. భా. ౨. ౨౨ (సింహనాదము) బొబ్బ, బొబ్బార్పు, సింగరవళి.
ఆర్వేరము. శ. వై. చూ, అరివేరము (కలహమునకు— "గీ. విభునికలహంబుతో నిట్లువెలఁదిసిగ్గు, పోరుటెల్లనువట్టి యార్వేరమయె" అని. ౧అ: వైరమునకు— "ఎ. గీ. వట్టియార్వేరమునబలవంతుతోడిసాటికిఁబెనంగుటెల్లవిఫలముఁగాదె" అని. ౧అ:
ఆఱడి. 1. శ (నింద) చూ, అగడారు
2. శ (వ్యర్థము) చూ, ౧ఆటమట
ఆఱడిపడు. 1శ. అ. క్రి (వ్యర్థమగు) ఆఱడిపోవు, ఆఱడివోవు, ఈటువోవు, ఊడివోవు, గొడ్డువోవు, చెన్నఁటివోవు, పాసుపడు, పొన్నడు, పొల్లవడు, పొల్లవోవు, పొల్లువడు, పాలివోవు, బీఱువడు, బీఱువోవు, బీఱువాఱు, బోరువోవు, ముంజ

మో ము, మేల్కొనఁబోవు, రిత్తవోవు, న
ష్టమవోవు, వీటిఁబోవు, వీసరపడు, వీసర
పోవు, వీసరవోవు, సుడివోవు [డు
2—(నిందింపఁబడు) చూ, ౧అగడుప
అఱడివోవు. శ. అ. క్రి. చూ, ౧ అఱడిపడు
అఱడివోవు. శే. ౧౩. అ. క్రి—పై—
అఱసముద్రము. అం ౩. ౧౮ (క్షీరసముద్ర
ము) జిడ్డుకడలి, జిడ్డునీర్సామి, జిడ్డుకడ
లి, పాలకడలి, పాలమున్నీరు, పాలవాఁ
గు, పాలవెల్లి, పాలసంద్రము, పాలేఱు,
పాల్కడలి
అఱాపు. పా (ప్రణాదము) చూ, అరపు
అఱు. 1. శ. స (అయిదునొకటి, షట్కము)
ఇత్తిగ, ఇఱుతిగ, ఇరుమూఁడు, ఇర్తిగ, చ
క్కు [గు
2. శ. అ. క్రి (ఉపశమిల్లు) చూ, అణఁగా
3. —(తడితీయు)
4. —(నశించు) చూ, ౪అడఁగు
అఱుగురు. శ. స (అఱుమంది) అఱు వురు
అఱుచు. 1. శ. ప్రే. (ఉపశమింపఁజేయు)
2. శ. ప్రే (తడియఁజేయు)
3. శ. ప్రే (నశింపఁజేయు)
అఱుపలము. పా (షట్పలి) అఱ్పలము
అఱుపు. 1. శ (ఆక్రోశము, కూఁత) కూఁత,
కూయి, మొఱ, మొఱపు, మొఱ్ఱ, వాపో
క
2. శ (రొమ్ములబొబ్బరింత)
3. శ (పశుకంఠరవము) చూ, అరపు
4. శ. ప్రే. చూ, అఱుచు
అఱుమూఁడగు. అం. శే. ౬. అ. క్రి (కార్యవైక
ల్యముగు) గచ్చుపిచ్చగు, చెడు, బుసివో
వు, బెడగు, బెడియు, బెసుకు
అఱుమోములవేలుపు. శ (కుమారస్వామి)
చూ, అగ్గిచూలి
అఱువాల్లు. శ. బ (కొంచెమువెలుడుట)

అఱు వురు. శ. స. చూ, అఱు గురు
అఱుమూఁడు. శ. చూ, అరుమూఁడు
అఱువ. పా (సీమ)
అఱుసు. శ (అఱుకుంచములు)
అర్ఘము. పా. చూ, అర్ఘము
అఱ్పలము. పా. చూ, అఱుపలము
అలంకి. 1. శ (హరిచీఁవంటిపల్లకి) [ములు
2. శ (బాలక్రీడావిశేషము) చూ, అందల
అలంకిగుడి. శ (బాలక్రీడావిశేషము) చూ,
అందలములు
అలంకులు. శ. బ—పై—
అలకాపరి. 1. శ (విష్ణువు) చూ, అడుగుచె
మ్మటలాఁడు
2. శ (కృష్ణుఁడు)
అలకి. పా (అనాథ) చూ, అనద
అలకించు. 1. శ. వై. స. క్రి = (అలక్షణమ్, అ
దరించు) చూ, ఆదుకొను "గీ. అంచలాడ
యాలకించివినుఁడు,, చంద్ర
2—(శ్రుతమగు) ఆలించు, ఊఁకొట్టు,
ఊఁకొను, చెవిదోఁపెట్టు, చెవియొగ్గు,
చెవివాలఁబెట్టు, విను, వీనిచ్చు
అలఁగాపరి. 1. అం. ౧, ౭ (విష్ణువు) చూ, అ
డుగుచెమ్మటలాఁడు
2. పా (గోపాలుఁడు) అలగాఁపు, కా
టిపాపఁడు, కిలారి, కీలారి, గొల్ల, గొల్లకి
లారి, గొల్లకీలారి, గొల్లఁడు, గొల్లవాఁ
డు, పసిగాఁపు, పసులకాపరి, పసులవాఁ
డు, వ్రేఁడు
అలగాఁపు. పా. చూ, ౨అలఁగాపరి [స్త్రీ
అలతి. శ. వై = (అలప్తిః, రాగాలాపము) అల
అలత్తి. పా. వై —పై—
అలపించు. శ. వై. స. క్రి = (ఆలాపః, రాగ
మునాలాపించు) ఆలాపించు
అలపోతు. 1 శ (వృషభము) చూ, ౧అఁబోతు
అలము. 1. శ. వై = (హారః, యుద్ధము) చూ, ౧

ఆనటిల్లు.శ.అ.క్రి. (అనుకూలమగు) "గీ.అ
తఁడుఁగొఁ ఆపాతమ్ములనుండి హారువు
దెరువు,లావటిలఁ దెల్ప.,, రా.పా.౨.ఆ:
ఇందు,ఇముడు, ఒంటు, ఒడఁబడు, ఒ
దవు, ఒనరుపడు, ఒనవెట్టుగొను, ఒ
ప్పు,ఒవ్వ, ఓవు,గిట్టు,పొందుపడు,పొ
నరుపడు, పొసఁగు, వాటపడు,వీలు, వీ
లుపడు,సరిపడు.

ఆవడ.1.శ. చూ,ఆడవిబీటి*
2.పా. చూ,అమవస.

ఆవడి.శ.(ఉపద్రవము) చూ,౫.అంగద
"క.మానుగ జగముల యావడి,మాను
పఁగాఁగోరి." అచ్చ.సుం.కాం.

ఆవపాటు.1.శ.అ.క్రి.(జష్తికివచ్చు)
2—(భావముదయించు)తట్టు,తోఁచు.

ఆవము.1.శ.వై =(ఆవాపః) చూ,ఆమము.
2.పా.(నింద)చూ,అగడారు.

ఆవరింత.1.పా.(జృంభణము)ఆవలింత, అ
వురింత,అవులింత.
2.పా(అక్రమణము)చూ,౨.అటు ము

ఆవల.1.శ. (పారము) చూ,౨. అక్కడ.
2.శ (పిమ్మట)చూ,౨అవతల.

ఆవలి.శ(ఉపద్రవము)చూ,౫అంగద"సీ.
మురహాయగిరివాంతి మూలఫేనావలి
నావలిదలఁగఁ జీకొనుపటిచె.,,ఉ.హ
రి,౪.ఆ:

ఆవలింత.పా.చూ,౧ఆవరింత

ఆవలిమొన్న.పా(మొన్నటికిపూర్వదినము)

ఆవలినాఁడు.ప.౧.౫౩(ఎల్లుండికిపరదినము)
ఆవలియెల్లుండి.

ఆవలియెల్లుండి.పా.—పై.—

ఆవలు.శ.బ.చూ,అబలు.

ఆవళి.1.పా. (కష్టము) చూ,౨.అగచాటు.
2.పా.(అధికము)చూ,౪. అంకపొంక
ములు."భానుమండల కరావళి యావళి
పాడిపుచ్చు తీఁగందల పిందు నమ్మగు వ
ఁగన్గొని రొంకయు విస్మితాత్ముఁడై",
పా.హ.
3.శ.(ఉపద్రవము) చూ,౫. అంగద.
"ప్రత్యలఘుతరంగసంపదల కొవళులా
వళులు ,,చమ.౧ ఆ.

ఆవాలు.పా.బ.చూ,అబలు.

ఆవి.1.శ.(తాపము) చూ,౨. అక్కసము.
"మ. విహరించున్ మలయానిలం బచ
టఁ దావింజిల్కి నెమ్మోవియా, విహరిం
చుంబికనాదముల్ చెవికిఁ గావించుం
జవుల్పోదమా ,, విజ. ౨ ఆ.
2.శ (శ్వాసము) "గీ. అసుయోధనును
క్కునవావిగలుగఁ, బుడమి నీకిఁడు.,,
భార.ఉద్యో.౩.ఆ: ఊడుపు, ఊడ్పు,
ఊపిరి, ఊరుపు, ఊర్పు, గ్రుక్క, గ్రు
క్కిలి,సరము.
3.పా.(ఊష్మము) ఆవిరి, ఉక్క, ఉ
బ్బ,ఉమ్మ,ఉమ్మదము, ఉమ్మలిక, ఉ
మ్మలిక,ఉమ్మలింపు.

ఆవించు.శ.స.క్రి. (వాసెనమీఁదబెట్టిఆవి
రితోఁబక్వముచేయు) "ఆవించినకుడు
ములబానలు.,, కాశ.౩ఆ.

ఆవిడ.పా.స. చూ, ఆకె.

ఆవిడి.పా.(ఉపద్రవము) చూ,౫ అంగద

ఆవిరి.శ.(ఊష్మము)చూ,౩ ఆవి.

ఆవిరిల్లు.శ.అ.క్రి (చెమటగలదియగు) చె
మటపట్టు,చెమటపోయు,చెమరించు,
చెమరుచు,చెమర్చు,చెమ్మరించు.

ఆవిలి.శ (మాంత్రికుఁడుఉపయోగించెడు
కాచపాత్రవిశేషము}

ఆవు.శ.(గోవు)చూ,ఆఁబని [త

ఆవురింత.పా.(జృంభణము)చూ,౧ఆవరిం

ఆవురు. శ. (రోదనాధ్వన్యనుకరణము)
చూ, ఆవురుసురు." ఉ.నీవొకయితత

యూవృగనియేస్వేఁగదన్నకవిమారరత్న
మా.,,పర.౨.అ:

అవులించు.శ.అ.క్రి. (జృంభించు)

అవులింత.శ.(జృంభణము)చూ,౧ అవరింత

ఆశపడు.శ.మి.అ.క్రి(అపేక్షపడు) ఆసపడు,ఎలయు,మరగు

ఆస.1.పా.(దిక్కు,దిశ)కడ, కెలఁకు, కెలను,చక్కటి,చెఱఁగు,దిక్కు,దెస, వంక,వలఁకు,వలఁకువు,వలను [క్క్ఱ
2.శ .వై= (ఆశా.కాంక్ష)చూ,౧.అ

ఆసకప్పెరగాఁడు.శ(పక్షివిశేషము)చూ, అంబటిజోరిగాఁడు

ఆసగలది.పా(కులట)చూ,అంటెగది

ఆసచేయు.శ.స.క్రి (ఆశించు) ఆసించు,కచ్చుకొను. [క్క్ఱ

ఆసక్తి.శ.వై=(ఆసక్తిః,కాంక్ష)చూ,౧అ

ఆసపడు.శ.వై. అ.క్రి. చూ,ఆశపడు

ఆసపాటు.శ.వై.(అపేక్షపడుట)

ఆసరా.శ.వై. (ఆశ్రయము) చూ,౧అండ

ఆసాది.శ.(మాతంగుఁడు) తద్భేదములు.—
గూబరి,గోసంగి,చచ్చుడి,మాదిగ.

ఆసించు.శ.వై.స.క్రి.చూ,ఆసచేయు

ఆసు.పా. (తంత్వావర్తనము)ఆసుఁగోవి

ఆసుఁగోవి.శ—పై— [ట్టు)

ఆసుమార్చు.శ (సాలెవాని ఒక కొలము

ఆసువోయు.శ.స.క్రి (పోఁగుపాటించు) పోఁగువాటు

ఆస్తి.1.పా(ధనము)ఒడమి,ఒడమె,కాసు, చాకట్టు,డబ్బు,దనము,దస్తు,నగదు,నెలగ,పయికము,పయిఁడి, పసిఁడి, పైకము,పైఁడి,ముడుపు, మొల్లము, రూక, రొక్కము,రొ,లపక,లిబ్బి, విడిముడి, సొము
2.శ.(కూడఁబెట్టినధనము) [కుప్ప.

ఆస్తికాఁడు.శ.(ధనవంతుఁడు)చూ,అప్పు

ఆహారకము.శ. (అగ్ని)చూ,అగాపు."ద్వి.ఆహారకంబులఁబెట్టియు విదక్కుమితులు,సాహసంబునఁబల్కి సాక్షులఁబెట్టి.,,హరిశ్చ.౨.భా.

ఆహా.శ.వై.అవ్య=(అహహా,ఆశ్చర్యార్థకము) చూ,౧అక్క."ఆహాపుట్టెడులాఁతిచూపఱకు.,,భార.శల్య.౨అ:

## ఇ

ఇ. ఒకయక్షరము

ఇంకు.శ.అ.క్రి(శోషిల్లు)చూ, అడుగంటు

ఇంకుడు.1.శ(ఇంకుట)
2.శ.విణ(ఇంకినది)
3.శ.విణ(ఎండినది)"సీ.ఇంకుడు చన్నులుపంక చేతులఁ గడువలమైన గానుగవంటినడుము"హరిశ్చ.౪.అ:

ఇంకువ.1.పా.(చిహ్నము)చూ,అంకనము
2.పా(ఉన్నతభూమి,స్థలి) దిబ్బ,మిట్ట, మిఱ్ఱు, మెండు, మెట్ట, మెరక, మేడు, వెలిగడ,

ఇంగలము.శ.వై=(అంగారః)చూ,౧అగ్గి

ఇంగిలము.శ.వై =—పై—" కెరలు నాతేనితూపుటింగలమునంచు"అచ్చ.సుకాం.

ఇంగలింపు.పా(మల్లయుద్ధములోని మెలకువ)కదలుతులుము, చేఁతిపాదువ, జంపు, టెక్కు,దండ,నిలుకడ,విసరాకడ

ఇంగిలాయ.పా.(కరదీపము) చూ,అగ్గిబోడి.

ఇంగిలాయి.శ.(మత్స్యవిశేషము) చూ,అంబుపక్కెర

ఇంగిలీకము.శ.వై=(హింగుళః)ఇంగిలీకము

ఇంగిలీకము.శ.వై=—పై—

ఇంగువ.శ.వై=(హింగు,సంబారవిశేషము)

ఇంచిమించి.శ.వి(రుచిగలభక్ష్యము, భక్ష్య విశేషము) చూ,అంగరొల్లెలు"గీ.తనకు ననుకూలయగునొక్క దాసితోడ,మా లిమియొనర్చికొని యించిమించిపెట్టి.,, శుక.3ఆ:

ఇంచు.1.శ.వై.=(ఇక్షుః*)ఇంచుమాని్ను, కన్నులమండ, కన్నులమాని్ను, చెఱకు, చెఱుకు,తియ్యమాను, తియ్యమాని్ను, తుంట, ముత్తెపుఁబంట

2.శ.అ.క్రి. (ఇంపగు) "క.నీకర్ణములకు నించునెట్లు కార్యవచనముల్.,, భార. ఉద్యో.౨ఆ: పట్టు

3—(మనోజ్ఞమగు) "ఎ.గీ. మెఱసితా మేటివెన్నెలమిన్న యించె.,,హన.3ఆ:

4.శ.స.క్రి (ఇచ్ఛించు,కాంక్షించు)"క పల్లవాలలక్ష్మీజ్వల్యముగను,బులినమ్ముల నించెలీలభూవరుఁడచటన్.,, హన.౨ ఆ: ఇచ్ఛగించు, కోరు,తివురు, మరగు, వలచు, వేఁడు, వేఁడుకపడు,వేఁడుక సేయు.

ఇంచుక.శ.వై.అవ్య (కించిదర్థకము) ఇం చుకంత,ఇసుమంత,ఒకింత

ఇంచుకంత.భా.3.శర. అవ్య—వై—

ఇంచుట.పా(ఎచ్చుట)"ఇంచినవేడ్కనా త్మహృదయేశ్వరిఁగన్గొని"పా.వా

ఇంచుపాలకడలి.శ(ఇక్షుసముద్రము)

ఇంచుఁబోఁడి.1.శ(చెఱకువలె అందమగు అఁటుది)చూ,అంచయాన

2—శ.(స్త్రీ)చూ,అతివ

ఇంచుమించు.శ(న్యూనాధిక్యము)"గీ.నలిన లీలసంచునలినలిగావించునించుమించు, లాడునించుమించు,లేమనగవుచూపు' విజ.౧ఆ:ఈరసుటిక,రమరమి,రమారమి

ఇంచుమాని్ను.పా(ఇక్షువు*)చూ౧ఇంచు

ఇంచువిలుతుఁడు.శ (మన్మథుఁడు) చూ,

అంచరాయుఁడు,గుహ్యానందుఁడు

ఇంజేటి.శ(ఒకదినుసుకంద*)ఈఁజేటి

ఇంటరము.శ(సంకటము)చూ,అనరు"ఒం టరమింటరములువలుకుటుచితమే,,భా ర-ఉద్యో.ర.ఆ:

ఇంటాతఁడు.శ (ధవుఁడు,భర్త)ఇంటియా తఁడు, ఒడయఁడు,ఒడయుఁడు,చెలు వుఁడు, పెనిమిటి, పెన్మిటి, మగఁడు, మనువు, ఱేఁడు,సామి.

ఇంటికాఁపు.శ (గృహస్థుఁడు) ఇంటివాఁ డు,ఇలుదొర, ఇలుఱేఁడు,కాఁపు, గే స్తు, గేస్తుఁడు,గృస్తు,మనికిఱేఁడు

ఇంటిపట్టు.శ(గృహస్థధర్మము)"సీ.పసుపు నిగ్గులు దేఱుపాఁపజన్నిద మొప్పఁ బ్ర మథాధిపతియింటిపట్టెటింగి,,,స్వా.౧ ఆ:

ఇంటిపాప.శ(వెలఁగొన్న దాసి)

ఇంటియాతఁడు.శ.చూ,ఇంటాతఁడు[లు]

ఇంటిల్లిపాది.శ.అవ్య (కుటుంబమువారంద

ఇంటివాఁడు.పా.చూ,ఇంటికాఁపు

ఇంటఁ్రిపడు.శ.అ.క్రి(సంకటపడు) కక్క సపడు,గుజగుజలాడు ,గుజగుజవోవు, గుజగుజలువోవు,చిక్కుపడు, చిక్కువ డు,తొక్కటపడు, త్రొక్కటపడు, నులిగొను,ముట్టుపడు,సంకటపడు

ఇంటఁ్రిము.శ(సంకటము) చూ,అనరు" గీ. ఎదురుగానేగుదెంచుచోనింట్రమయ్యె బెండ్లియరువంక చుట్టంపుఁబెద్దలకును,,ర సై.౬ఆ:

ఇండు.పా (ఖర్జూరిక*)ఈఁత, ఈద, ఈఁ దు,చిట్టీత,చిట్టీఁదు [లు

ఇండె.1.శ (చీలిక,శకలము) చూ,౧ అరవ

2.శ(ఎముకకీలు)

ఇండెవాయు.శ.అ.క్రి(చీలు,ఆస్ఫోటిత మ గు,భేదిల్లు) ఇడియు,చినుఁగు,చిరుఁగు,

శీలు, పగుళ్లువాఱు, పటియవాఱు, పాయపడు, పకులు, పిక్కటిలు, పిక్కటిల్లు, పిగులు, పీలు, బీటగిలు, బీటగిల్లు, బీటలువాఱు, బీటలువోవు, విచ్చు, విరివాయు, వ్రయ్యఁబడు, వ్రయ్యవాఱు, వ్రయ్యలువీలు.

ఇంత.1.భా.వి.ఉ.వా.అవ్య.(ఏతావదర్థకము) 2.శ.స.(తఃకాలఁడ) "ఎ.గీ.నీయోగవిభవ, మింతయుంతని పొగడ నేనెంతదాన.,, కళా.౨.ఆ.

3.శ.స. (ఇదియింతయను) "క.తొడె, వ్వారికిఁ బోనెంత నిక్కువం బెబ్బంగిన్.,, భార.ఉద్యో.౧.ఆ: ఇంతపట్టు.

4.శ.(ఇంత కాలము) "చ. కుంతియింత సేన్, దుగియు పాలలోఁబడిన బల్లివిధంబుననుండెనుండునే.,,

ఇంతకుమున్ను. పా. (ఇక్కాలముకంటెఁ బూర్వకాలము)

ఇంతంతనరానిది.పా. (పరిమితి చేయుటశక్యము కానిది)ఇంతింతయనరానిది.

ఇంతింతయనరానిది.పా.—పై.—.

ఇంతపట్టు.1.పా.అవ్య. (ఇంతపర్యంతము) ఇంతపడి,ఇందనుకన్,ఇందాకన్.

2.శ.స(ఇంతమాత్రము)ఇంతియ, ఇంతె,ఇంతే.

3.శ.స.చూ,3 ఇంత.

ఇంతపడి.పా.అవ్య.చూ,౧.ఇంతపట్టు.

ఇంతలు.పా.(ఇంపులేసి)

ఇంతి.గ్రా.స్త్రీ=(స్త్రీ)చూ,అతివ.

ఇంతియ.శ.స. (ఇంతమాత్రము)చూ,౨ఇంతపట్టు."మ.పెక్కండ్రికిం, తియకోలంబయియుండ నీమనము శాంతింపఁదగా నేర్చునే.,,భార. ఉద్యో. ౪ఆ:

ఇంతె.శ.స.—పై—

ఇంతే.శ.స. —పై—

ఇంతికాపుంజు.ప.౧.౨౬(ఇంద్రుఁడు)ఒసలిఘూపాడయుఁడు, ఒడలుచూపాడయుఁడు, కతి, కొంతపగతుఁడు, కొండతెక్కలుగొట్టినదణి, గట్టుదాయ, చాదంతరయెకిమీఁడు, జడదారియింటికోడి, జేజే, తలఁపుమానికముగలాఁడు, తలఁపుటాయి సంతరించినదొర, తూపుపుడణి, తూపుపుతోఁడు, తెలిగంటితోఁడు, నిక్కుపీనులజక్కినెక్కురౌతు, నిలువెల్లజూపులైవెలయువాఁడు, నూఱంచులకత్తిఁజేగాంచుజోము, నూఱుజన్నముల సోమాసి, ఒటువాలాయుఁడు, బాసవాల్గొర, మబ్బువుతు, మలగొంగ, మొగులెక్కపోత్రిడి, మొదటిదిక్కు సుబాదారి, మొఁగనురా, వినుపోత్రిగొర, విప్పుకప్పుతోఁడు, వెన్నువన్న, వేగన్నులసామి, వేగంటి, వేలుపుతోఁడు, వేల్పుతోఁడు, సురతాణి, సోమాసిపెట్టుఁజెట్టు.

ఇందనుకన్, శ. అవ్య (ఇంతపర్యంతము) చూ,౧.ఇంతపట్టు.

ఇందాకన్.శ.అవ్య—పై—.

ఇందము. శ.స.క్రి.వి (ఇదిగోతీసికొనుము) "జనలోకరత్నమిందమనుచునిచ్చి,, రామా.౬ఆ:[దీనికిబహువచనము.ఇందండి]

ఇందఱు. 1.శ. స. (ఇంతసంఖ్యకలవారు)
2.శ.స.(ఇంతశబ్దమునకు మహన్మహత్యర్థకబహువచనరూపము) "ఈస్త్రీపురుషులందఱు.,,

ఇందన్:శ.అవ్య.(అత్రార్థకము) ఇక్కడన్, ఇచటన్, ఇచ్చటన్, ఇయ్యెడన్, ఈడన్.

ఇందు.1.శ.అ.క్రి.చూ,అడగారు."ఇందనియామముచేఁ బొదలు నేచుఁగులు." య.౪.ఆ:

2.— (అనుకూలపడు) చూ,అవటిల్లు

ఇందుగు,శ.(కతకము*)"ఎ.గీ.అందుగుల

గేసంగులుమట్టులింగుగులు ను.,.తిచ్చ.
సుం.కాం.ఇంముపు, ఇన్నుగ, చిల్ల,చి
ల్లగింజ.

ఇంముప్పు.శ.(సైంధవలవణము) చెంముప్పు.

ఇందులకున్.1.శ.అవ్య.(ఇక్కోటికి) "ఇం
దులకిమ్మోయిన్ మనుజు లెవ్వఁడుఁత్తు
రే,,భార.ఆది.౬ఆ:
2.శ.అవ్య.(దీనికి) "ఇందులకుఁబొందు
పడు ప్రత్యుత్తరంబులవీనిం గెలంకినబుద్ధి
క్షోభంబుగా నింతకంటె నేమేమియు
ద్ధంబులువినంబడునో.,,ఆము.౬ఆ:

ఇంముపు.1.శ(కతకము*) చూ, ఇంగుగు.
2.శ.(చిల్లగింజ)"నీళ్ల కలఁక నింముపటా
-చి తెలుచుభంగి.,,వాసి.౨.ఆ:

ఇంపితము.శ.(ఇంపైనది)

ఇంపు.1.శ.(సంతోషము) చూ,౧.అరసెము.
"ఆయింపేపరబ్రహ్మము." స్వా.౨ఆ:
2.శ. (కాంతి) చూ,౧అక్కఱ."ఉ.
ఓ.నితంబినీసుగంధిపటా భరణాదికంబు
నీ,నెమ్మదికించనోయ నుడునేపయినం
జరికించితోరనా, నెమ్మది యింపుగింపు
ననినీరజలోచనపల్కి వెండియున్.,,ప
ర.౩ఆ:
3.శ.(ఇష్టము)"క.అనిందితచరితము లె
సుమ్ము నీమదికింపుల్ .,, కళా. ౩.ఆ:
ఇంబు.

ఇంబు.శ.—పై—

ఇఁకన్.1.శ.అవ్య. (ఇతఃపరము)
2.శ.అవ్య.(పునరర్థకము)చూ,అప్పటి.
"ఇమ్మునీశ్వరు సామర్థ్యమునింకఁజెప్పె
ద.,, రా.ఆర.౧.ఆ:

ఇగన్.శ.అవ్య.—పై—

ఇక్క.1.శ.(గృహము)ఇమ్ము,ఇరవు,ఇరవు
పట్టు, ఇలు, ఇల్లు, ఉనికిపట్టు,గీము,
టెంకి,తాణి,తాణియ,రాణె,తావు,తా
వలము,తావు, తిరుమాళిగ, టెంకి,తొ
ట్టికట్టు,దీమము,దీము,నట్టు,నెలవు,ప
నికిపట్టు,లోఁగిలి,లోఁగిలి,సాల.
2,శ.(స్థానము) "క.ఎయ్యదిసుఖమునుల
కునిక్క యేర్పడఁ జెపుమా." భాగ.౩
ర.౭ ఆ: ఇక్కువ, ఇమ్ము, ఇరవు, ఇగు
వు,ఉనికి,ఎడ,ఎడము,కంగి,కంనవ,
కట్టు,కడ,కలకు,కలను,కలిమి,కల్గి,గి
రిడి, చక్కటి, చక్కి, చేపట్టు, చో,
చోటు,టెంకి,తాణా, తాణి,తాణియ,
తాణె,తావు,తల, తలము, తానకము,
తానము, తావలము,తావు, తెంకి,నట్టు,
నిట్ట,నిలుకడ,నిల్కడ, నెట్టు, నెప్పు,
నెల,నెలకువ,నెలవు, నేల, పట్టు,పొల
ము,మట్టు,మనికి, మన్కి, వలతి,సీమ.

ఇక్కట్టు.శ(సంకటము)చూ,అనరు.

ఇక్కడన్ భా.౩.౬౬అవ్య.చూ,ఇంకన్

ఇక్కము.శ(సంకటము) చూ,అనరు" ఉ.
ఎక్కడివాఁడవన్న కడునిక్కపుఁగాఁబ
డవింజరించెదు,,ఉ.హరి.౨.ఆ:

ఇక్కపాటు.శ—పై—.

ఇక్కువ.1.శ(స్థానము) చూ,౨ఇక్క"క.
మీ,రిక్కడనుండియమీమీ, యిక్కువ
లకుఁజనుఁడు దానవేశ్వరులారా,,రా.
యు.కాం.
2.శ(ఉనికి)"ఎచ్చటఁగంటిరోవిజయు
నిక్కువనిక్కువమానె,,విజ.౨.ఆ:
3.శ(జాడ)చూ,ఆచూకి" ద్వి.ఇటుచె
ల్లుమాటలయిక్కువలెటిఁగి,,రా.యు.
కా. [లా.౩.ఆ:
4.శ.(కళాస్థానము)"ఇక్కువలంటి,,నీ

ఇగము.1.పా.పై=(హిమము)ఇవము, మం
చు.
2.శ.పై(శైత్యము,శీతము)ఇవక, ఇవతా
లింపు,ఇవము,ఈము,చలవ,చల్వ, చలి,
చలిమిరి,చల్మిరి,చలువ, చలువడి,చల్ల,
చల్లఁదనము,చల్లన,జలుబు, జలువు,తను

పు,తస్పు, షేరివము, పలి, వలిపిరి,సీత్రి, సీతు,సీతువు.

ఇగిరించు.1.శ.అ. క్రి (పల్లవించు) ఇగురు కొను,ఇగురుచు,ఇగురొత్తు, ఇగుర్చు,ఇ గ్రుచు,ఇవిరించు,ఇవురుచు, ఇవుర్చు,చి గిరించు, చిగురుకొను, చిగురుచు,చిగు రొత్తు,చిగుర్చు, తలిరుచు, తలిర్చు,నన యు,ననుచు,మొగ్గవిచ్చు

2—(అరుణిమమగు) "అనుమందలిగి మొగమిగిరింపగా.,,య 3 ఆ.

ఇవిరించు,చిగురుచు,చిగుర్చు.

ఇగిరిక.శ (సాపిష్యము)ఇగిరికె,నిగిరిక

ఇగిరికె.భా.౨.౧౭౨ —పై—

ఇగిలించు.శ.స క్రి(పండ్లనువెలిపఱచు) ఇ గులుచు,ఇగుల్చు, ఇవులుచు, ఇవుల్చు.

ఇగిలింత.శ (ఇగిలించుట)

ఇగురు.1.పా (అంకురము) ఈరిక,నసువు, మొక్క, మొటిక, మొట్టిక, మొలక, మొలవ,మొల్క,మోకి, మోటిక,మో డు,మోసరిక,మోసు, మోసేరిక,మ్రో డు.

2.శ(కిసలయము) ఇవురు, ఈరిక,చిగు రు,చినుము,చివురు,తలిరు,నన.

3.శ(పండ్లచుట్టు నుండుకండ)

4.శ.అ.క్రి(శోషిల్లు)చూ,ఆడుగంటు.

ఇగురుంబోండి.1.శ. (చిగురువలెఅందమైన అందుది)చూ,అంచయాన

2.శ ( స్త్రీ )చూ,అతివ [గిరించు

ఇగురుకొను.శ.అ.క్రి(పల్లవించు)చూ,౧.ఇ

ఇగురుచు. —పై—

ఇగుర్చు. —పై—

ఇగురొత్తు.1.శ.అ.క్రి —పై—

2—(అనురక్తమగు) "వెడనవ్వునం బ్రియుచిత్తంబిగురొత్త.,,భార.అర.2 ఆ: చిగురొత్తు [ఇగిలించు

ఇగులుచు.శ.స.క్రి(పండ్లనువెలిపఱచు)చూ,

ఇగుల్చు.శ.స.క్రి—పై—

ఇగురువిల్తుండు.వెం.వా (మన్మథుండు) చూ, అంచయేనుంగుమావంతు

ఇగో.శ.అవ్య(చూపుటనుదెలిపెడి)"వీం డిగోగుఱ్ఱపుదొంగవచ్చె"జై.3 ఆ: ఇది గో,ఇదిగో,ఇదియు,ఇదె.

ఇగ్గు.శ.అ.క్రి(వెనుకకొఱగు) "ఇగ్గమ్రొగ్గ సీడ్చె." : ఈగు

ఇగ్గులాట.శ (ఇగ్గులాడుట)

ఇగ్గులాడు.శ.స.క్రి(వెనుకకీడ్చు)"చిరగతి నిగ్గులాడకువెస్గ్గ,, రస.3 గు:

ఇగ్రుచు.శ.అ.క్రి(పల్లవించు) చూ,౧ ఇగిరిం చు."ఎ.గీ.ఇగ్రుచుకోర్కులం దనడెంద మిపాళింప ,, కవిక.3 ఆ:

ఇచటన్.భా.3.౬౬.అవ్య (అతాన్ర్థకము) చూ,ఇందున్

ఇచ్చ.శ.వై (హృదయము,చిత్తము)చూ,౧. ఆద" అనితనమాటకియ్యకొనునన్నరు పల్కులకిచ్చమెచ్చి,,భార.మహా.౧ఆ:

2.శ వై= (ఇచ్ఛా,కాంక్ష) చూ,౧అ క్కఱ

3.శ.వై(యదృచ్ఛ) చూ,౬అలవోక" క.తా,నచ్చటనంతిర్హితుండై,యిచ్చంజ నియె,,భార.విరా౫ఆ:

4.శ.వై.విశ (అభీష్టము) "క. మీ,కె న్నంగ నేవరములిచ్చియిచ్చెదవానిన్,, ఉ.హరి.౬.ఆ: [ఋచ్చికము

ఇచ్చకము.1.శ.వై(ఇష్టోక్తి)చూ,౨అచ్చిక

2.శ.వై(ప్రియము)చూ,౧అంటు" ఎట్టి చ్చకమయ్యెనీకునివి" కాశ.౨.ఆ:

ఇచ్చకొలమారి.పా (ప్రియవాది)ఇచ్చకుం డు,ఇచ్చగొండి.

ఇచ్చకుండు.శ.వై—పై— [రి.ఇంచు.

ఇచ్చగించు.1.శ.వై.స.క్రి(ఇచ్ఛించు)చూ,

2—(అంగీకరించు,సమ్మతించు) "ఉ. నాతలంపిచ్చగింపుమనినన్ బ్రభుండిందు

కయిత్యుకోలునన్" హరి. ఉ.౨. ఆ:
ఇత్యుకొను,ఈకొను, ఈయకొను, ఒడఁబడు,ఒప్పుకొను, కొలుపు, డిం(దుపడు,నూలుకొను,మెయికొను.

ఇచ్చగింత.శ.వై (సమ్మతి,అంగీకారము)ఇప్పికోలు, ఇయ్యకోలు, ఈకోలు, ఈయకోలు,ఊంకు, ఒడఁబడిక, ఒడఁబాటు,ఒప్పికోలు,ఒప్పు,ఒప్పుకోలు, కయికోలు,కైకోలు,సుంజూసు,మయికోలు, మయివడి,మెయికోలు, మెయివడి, మేకోలు, మేముడు, మేమును,మెకోలు, మైపడి,లాగు, సమకోలు, సమానము.

ఇచ్చగొండి.శ.వై. చూ, ఇచ్చకొలమారి.

ఇచ్చటన్.భా.౩.౬౬.అవ్య.చూ,ఇందున్.

ఇచ్చనుండువాఁడు.పా. చూ,అడ్డములేనివాఁడు.

ఇచ్చిపుచ్చుకోలు-శ (ఇచ్చిపుచ్చుకొనుట)

ఇచటు.శ.స.ఏ. (ఈస్థానము) ఇచోటు,ఇచ్చటు,ఇచ్చోటు,ఇచ్చోటు.

ఇచోటు.శ.స.ఏ—పై—

ఇచ్చటు.శ.స.ఏ—పై—

ఇచ్చోటు.శ.స.ఏ—పై—

ఇచ్చోటుశ.స.ఏ —పై—

ఇచ్చు.శ.స.క్రి(దానముచేయు) చూ, రాఅచ్చు. [త్త్వ.

ఇజారా.చం.గ్రా (గుత్త) గుత్త,గుత్తగ,గు

ఇజారు.శ.గ్రా (కొలికి తొడిగికొనుచట్ట) హిజారు.

ఇజుకు.1.శ(సంకటము)చూ,అనసు.
2.శ(శ్రమము)చూ,అతలకుతలము.

ఇట.శ.ఏ(ఇక్కడ)వాఁడిటవచ్చువాఁడో యేనంపుల కేగుదానవో,,భార.ఆర.౨ఆ:

ఇటన్.శ.అవ్య.(ఈవల) [టమీఁదన్

ఇటఁబట్టు.శ.అవ్య. (ఇదిమొదలుకొని)ఇ

ఇటమీఁదన్.శ.అవ్య.—పై—

ఇటక.పా.వై=(ఇష్టకా,బంకమట్టితోకాలవేసినతాయి)ఇటిక, ఇటికె,ఇటుక,ఇటిక,ఇట్టుక

ఇటిక.శ.వై=—పై— [డము.

ఇటికపగడము.శ.వై (క్కణిక,మట్టిపగ

ఇటికె.శ.వై. చూ,ఇటక.

ఇటు.శ.అవ్య. (ఏవమర్థకము) ఇటులు,ఇటువలెన్,ఇట్టు,ఇట్టులు,ఇట్టువోలెన్, ఇటు.

ఇటుక.భా.౩.౨౯. చూ,ఇటక

ఇటులు.శ.అవ్య.చూ,ఇటు.

ఇటువంటి.శ.విశ.(ఇట్టి)" కాగాదిటువంటి పల్కనక"కళా.౩.ఆ:ఇట్టి

ఇటువలెన్.శ.అవ్య.చూ,ఇటు." ఇటువలె వెదకె ను"రామా.౬.ఆ:

ఇట్టలము.1. పా (దృఢము) ఉక్కు,ఉనుటు,ఉసిరి,ఉబిద,ఊట, ఒఱపు, కటికె, కొదమ,గట్టి,చేగ,చేవ, తరపు, దిటము, దిటవు,గిటు, నేటు,పదిలము, బటువు, బిగి,బిగితను,బిగువు,బిట్టు,బెట్టు, బెట్టిదము, రుటము,సదాటు.
2.శ (అధికము) చూ,రఅంకపొంకములు."ఇట్టలముగఁ దగిలినట్టియొబ్బులువోలెన్"స్వా.౪.ఆ:
3.పా(స్థిరము)ఇరవు,ఉబిది,జితము,నిరము,పొలుపు,పొల్పు.

ఇట్టి.శ.విశ.చూ,ఇటువంటి.

ఇట్టిక.శ.వై=(ఇష్టకా)చూ,ఇటక

ఇట్టు.శ.అవ్య.చూ,ఇటు.

ఇట్టులు.శ.అవ్య—పై—

ఇట్టువోలెన్.శ.అవ్య—పై—

ఇట్టుక.పా.వై.చూ,ఇటక.

ఇట్టుపు.ప.౬.౯౫. (అజశృంగి*) జుట్టుపు, సుట్టుపు,దుట్టువు.

ఇట్లు.1.శ.అవ్య. చూ,ఇటు.
2.శ.అప(ఇఁకమీఁదజెప్పఁబోవుప్రకారము)"ధర్మజానకురోమశుండిట్లనియె."

ఇడి.శ.(సేవికాభృత్యము) సేవ, సేవియ, సేవె
ఇడుకుడక.శ(భృత్యవిశేషము) చూ,అంగ రొల్లెలు. [యు.
ఇడియు.శ:అ.క్రి(ఛేదిలు) చూ, ఇండేవా
ఇడు.1.శ.స.క్రి(దానముచేయు) చూ,ాఅ మ్చ్.2—(ఉనుచు)
ఇడుగడ.1.శ (గుణములయందుదోషమునా రోపించుట, అసూయ) "చ.తడయక మొక్కియున్న వినతా సుతునప్పుడు సూచియాత్మలో, నిడుగడసేయుచుక్ గడుసహింపక,,భార.అది.౨.ఆ:
2.శ(హీనత్వము)"చ.మై, నిడుగడసే యఁ గావలయు నీలువు మాలినఅంకు టాంౘడకున్"విజా.ఆచా.కాం. (ఇది ఇంకనువిచార్యము)
ఇడుపు.1.పా(పార్శ్వము)చూ,౧.అంక"పొడువుగుబ్బలి నేలపురుటింటియిడుపు నజటిచినగండపుఁజిటలనఁగ"పా.హ.
2.శ (గోడయిరుపార్శ్వములమీదిచోటు) "గీ. దారు వన వీ ధి శ్రీ తాంశుధరునిరంతు,శౌరిగోపాలకామి నీచార్యకేళి,కామరసభావములు మించి కానఁ బడఁగఁ, దీర్చియిడుపులయం దుఁజిత్రించినారు" సై.2. ఆ:పొదిక టు.
3.శ(చీలిక.ఖండము)చూ,౧. అరవర లు"ఇడిసినయిడుపులయెడల,,ఆము.౬ ఆ:
ఇడుమ.1.శ(ఆపద)చూ,౨అంకిలి"గీ.మగు వఁగోల్పోయికడునిడుమలఁ గలంగు,, ఉచ్చ.సుంకాం.
2.పా(కష్టము)చూ,౨.అగబాటు.
3.శ(దుఃఖము)చూ,ాఅంగద"గీ.విప్ర వరులుభోగములకువేట్క_సేయ,రిడుమ లిహామునఁ బడికొంతు రెలమిఁబరము, నందుసుఖము,,మార్క.ర.ఆ:
ఇడుమపాటు.శ(ఇడుమపడుట)
ఇడుసుడి.పా(కష్టము)చూ,౨అగచాటు.
ఇడ్డెన.శ(భృత్యవిశేషము)చూ,అంగరొల్లెలు.
ఇతఁడు.శ.స.ఏ(ఈపూజ్యుఁడు) ఈతఁడు, ఈయన.
ఇతకరి.శ.వై=(హితకారి)
ఇతము.శ.వై=(హితమ్)"ఎ.గీ.పలుపలుకు లేలఇంకనాచెలులుగిలులు,నేగుదెంచి విఘ్నమొనర్చరితమెఱుఁగక" (ఇత ము= ఇతమైనకార్యమని యర్థము) క శా.3.ఆ:ఇతవు,హితవు.
ఇతవరి.శ(హితముచెప్పువాఁడు) హితవరి.
ఇతవు.శ.వై=(హితమ్)చూ,ఇతము.
ఇతవుఁడు.శ.వై=(హితుఁడు)
ఇత్తడి.శ.వై= (పిత్తళమ్.అరకూటము)ఇత్తళి,పిత్తడి,పిత్తళి.
ఇత్తళి.శ.వై=—పై—
ఇత్తటి.పా(ఈసమయము)
ఇత్రిగ.1.భా.౨.3౦౬.స.చూ,౧.అఱు.
2.శ(పాచికలమీఁదిమూడుబొట్లజత, దుందుభి)ఇద్దగ. [ది,ఈయది.
ఇది.పా.స(ఏతచ్ఛబ్దార్థకము) ఇద్ది,ఇయ్య
ఇదిగొన్.శ.అవ్య.చూ,ఇగోన్.
ఇదిగో.శ.అవ్య.—పై—
ఇదికదా.పా.అవ్య(ఇదియేకదా)
ఇదియ.పా.అవ్య.చూ,ఇగోన్.
ఇదె.పా.అవ్య—పై—
ఇద్దరి.పా(అపారము)ఇవతల,ఇవల,ఇవ్వల,ఈతల,ఈవల.
ఇద్దఱు.శ.స (రెండుశబ్దమునకుమహత్సూహ ర్థకబహువచనాదేశము) ఇరుగురు,ఇరువురు,ఇర్వురు.
ఇద్ది.శ.స. చూ,ఇది.
ఇద్దరుతల్లులముద్దుబిడ్డఁడు.అం.౧.౧.౨(వినాయకుఁడు)ఏనుఁగుమోముసామి, ఒంటి

కొమ్ము వేలుపు, కలుఁగులాయప్రతేజిబలునిపాయి, కుడుములతిండికాఁడు, కొక్కెరవుతు, కొక్కెరౌతు, కోడెకెక్కెమువానన్న, గరికపూజలమెచ్చుగబ్బివేల్పు, గుంజిళ్లుపెట్టించుకొను వేల్పు, గుజ్జువేలుపు, గొప్పబొజ్జగలాఁడు, గొప్పమెయిప్రోడ, చేటచెవులవేలుపు, చేటవీనులదణి, టెంగణాసామి, పగడపంటిదొర, పనిచెఱుచువాఁడు, పనిచెఱుపువేల్పు, పాఁపజందెముల మేటి, పాఁపజన్నిగట్టు, పిళ్లారి, పెద్దకడుపువేల్పు, బిబ్బికడుపువేల్పు, బొజ్జదేవర, ముక్కంటితొలిపట్టి, ముక్కంటిపండులమెక్కెడుదిండీఁడు, మొదటివేలుపు, మొట్టికాయలమెప్పు, మ్రొక్కువారలపనుల్ జక్కఁజేసెడుసామి, వంకరతొండంబువాఁడు, హైనకయ్య.

ఇద్దుగ.శ. స.చూ,౨.ఇత్తిగ.

ఇద్దుము.శ(రెండుతూములు) ఇరుదూము.

ఇద్దెస.పా(ఈవైపు) ఈకడ.

ఇని.శ.స.ఏ (ఇంతశబ్దమునకు బహువచనాదేశము)ఇన్ని-

ఇను.శ.స(వృత్తియందుహల్లుపరగుచోరెంటికాదేశము గావచ్చునది) "ఇనుమాఱు,, మొ. [లు.

ఇనుకు.శ(తుషయుక్తాల్పధాన్యము) చింక

ఇనుపకచ్చడము.1.పా (ఇంద్రియనిగ్రహత్వము) [ట్టుకొన్న,,

2.పా(ఇనుపగోచి) "ఇనుపకచ్చడాల్గ

ఇనుపగోలెము.వెం.ఊ (అంగారధానిక) కమటము, కమ్మటము, కుంపటి, కుమురు, బంగల, వయ్యంది.

ఇనుపచిట్టెము.పా(మండూరము)

ఇనుపకుందులు. పా (తలఁపుబందులకాధారమైనది) [లు.

ఇనుపతేలు.శ(కృష్ణవృశ్చికము) ఎనుపతే

ఇనుపదుడ్డు.పా(ముద్గరము)గుదుప, గుదియ, గుదె, గునుపము, దుడ్డు.

ఇనుమడి.శ.స(ద్విగుణము)ఇన్మడి, ఇబ్బడి, ఇమ్మడి, జంట, జమిడి, జమిలి, దంట, దుగ, దుగణము, దువ, రెట్టి.

ఇనుమడించు.శ.స.క్రి (ద్విగుణించు) ఇన్మడించు, ఇబ్బడించు, ఇమ్మడించు, రెట్టించు. [మద్ది.

ఇనుమద్ది.శ(అశ్వకర్ణము*)ఏపెచెట్టు, నల్ల

ఇనుమనుమఁడు.శ(ప్రపౌత్రుఁడు)

ఇనుమనుమరాలు.పా(ప్రపౌత్రిక)

ఇనుమాఱు.పా(రెండుపర్యాయములు)

ఇనుమిక్కిలి.శ(అత్యధికము)

ఇనుము.శ(అయస్సు)ఇన్ము, ఉళి.

ఇన్ని.1.శ.స.ఏ.చూ, ఇని.

2—(ఈసమస్తము)

3—(ఇంతసంఖ్యకలవి)

ఇన్నుగ.పా.చూ, ఇంగుగు*. [ఱు.

ఇన్నూరు.పా.స(రెండునూఱులు) ఇన్నూ

ఇన్నూఱు.శ.స—పై—

ఇన్మడి.శ.చూ, ఇనుమడి.

ఇన్మడించు.శ.స.క్రి.చూ.ఇనుమడించు.

ఇన్ము.పా.చూ, ఇనుము.

ఇపుడు.శ.ఏ(ఈకాలము) ఇప్డు, ఇప్పుడు.

ఇప్డు.శ.ఏ—పై—

ఇప్ప.శ(మధూకము*)

ఇప్పటిది.పా (సద్యఃకాలసంబంధమైనది)

ఇప్పకఱ్ఱ.పా(మధూకదారువు)

ఇప్పనూనె.పా(మధూకబీజతైలము)

ఇప్పపూరాజనములు.శ.బ (శాలిధాన్యవిశేషము)చూ, అక్కుళ్లు. [ఈలాగు.

ఇప్పాట.పా(ఈప్రకారము) ఇమ్మెయి,

ఇప్పికోలు.భా.౧.౧౦౪ (సమ్మతి)చూ, ఇచ్చగింత.

ఇప్పుడు.శ.ఏ.చూ, ఇపుడు.

ఇబ్బంది1.పా(అశుభము)చూ,౩అఱ.

2.పా(కష్టము)చూ,౨అగబాటు.

3.శ(మిక్కిలినిర్బంధము) [పంది]

4.శ(అడవిపందికినిఊరఁబందికినిపుట్టిన

ఇబ్బందిగాఁడు.శ(భల్లూకము) ఎలుఁగు,ఎలుఁగుగొడ్డు, ఎలుఁగుబంటి,ఎలుఁగుమంటి,ఎలువు, ఎల్గు,ఎల్లువెలినోటిమెకము, పుట్టకాఁపు, పుట్టకూటిమెకము, పుట్టకూడుదిండి,పుట్టకూడుమెక్కుమెకము, బొచ్చుమెకము, బొల్లిమోరమెకము, మొగముతెలుపుమెకము,లేదు, వెనుకచూపులమెకము, వెనుచూపులమెకము, వెలినోటిమెకము, వెలుఁగుబంటి.

ఇబ్బడి.శ.చూ,ఇనుమడి.

ఇబ్బడించు.శ.స.క్రి.చూ.ఇనుమడించు.

ఇబ్బెద.శ (వృక్షవిశేషము) [ము.

ఇమిడిక.1.శ (అంతర్భూతము) చూ,అడక

2.శ (పొందిక,మైత్రి)చూ, ౩అంటు.

ఇముకలము.ప.౨.౧౧౯ (లేఖిని) కలపకట్టియ,కలపకట్టె,కలము,పేనా.

ఇముడు.1.శ.స.క్రి. చూ,అవగారు.

2—(అనుకూలమగు) చూ,అవటిల్లు.

ఇముడుకొను.శ.అం.ప్రే (ఇముడ్చుకొను)

ఇముడుచు.శ.ప్రే (ఇముడఁజేయు) ఇముడ్చు.

ఇముడ్చు.శ.ప్రే—పై—

ఇమ్మడి.శ.చూ,ఇనుమడి.

ఇమ్మడించు.శ.స.క్రి.చూ,ఇనుమడించు.

ఇమ్ము.1.శ (సుఖము)" ఇమ్ములనున్నవాఁడెహరి,,భాగ.౧౦.స్కం.పూ(ఈయర్థమందుయిదితఱచుగాద్వితీయా బహువచనాంతముగానే ప్రయోగములయందు గానఁబడుచున్నది) ఉసులు, పదిలము, పోఁడిమి,పోణిమి, బులుపు,బోగము,వసతి,సుకము,సుకులు,సుగము, సుమాళము,సొంపు,సోము,హాయి.

2.పా(గృహము)చూ,౧ఇక్క.

3.శ(స్థానము) చూ,౨ఇక్క."ఎ.గీ.అతులధైర్యంబునకునీమహాత్మ్యఁ డిమ్ము,, ఉ.రా.౫.ఆ:

4.శ( విరివి,విశాలము)"చ-పురం,బునకిచటిమ్ము చాలదనుబుద్ధి జనిఁచెగణించిచూడుమా''హరి.ఉ.౨.ఆ:ఒడ్డు, గరుము,తనరుపు,తనర్పు,నెరవు, నెఱవు, పరపు,పఱపు,బాళి,విరళి,విరివి,విరివిడి, విఱివి,వెడఁద,వెణఁద.

5.శ(మనోజ్ఞము) చూ,౨ అందము."వ.మనుష్యమాంసంబుఁదెచ్చియిమ్ముగావండిపెట్టిన,,భార.ఆది.౭.ఆ:

6.శ (అమూలము) "ఎ.విచారపూర్వకబకార్యంబునకు దైవంబుననుకూలంబగుంగావున నిమ్ముగా విచారింపవలయు,,భార.ఆది.౧అ:

7.శ(మైత్రి) చూ, ౩అంటు"క. తనకిమ్ముగునంతకుదు,ర్జనుఁడిష్టుఁడపోలెనుండిసర్పమువోలెఁదనకిమ్ముగుడును గలచును, ఘనదారుణకర్మగరళఘనదంష్ట్రలచేఁ,,భార.ఆది.౬.ఆ:

8.శ(ఇంపు) చూ, ౧. అరజము." ఉద్యోగపర్వమిమ్ముగుసభలఁ,, భార.ఆది.౧.ఆ:

9.శ (ఉపాయము) చూ,౨అనువు."క. ఇమ్మెఱుఁగనియట్టివారలిభపురనాథా,,భార.ఉద్యో.౨.ఆ:

10.శ (అనుకూలము) చూ, ౨అనుగలము."గీ.ఎత్తికొనిచనంగనిమ్ముగున్నట్లుగా,మెదలుచున్నద్రవ్యములదిమిరెంటిఁ, గూడఁబెట్టె,,భార.సభా.౧.ఆ:

11.శ(యుక్తము)చూ,౪.అనువు"వ.ఇమ్ముగునవసరంబున,, భార.ఆది.౬.ఆ:

12.శ(స్పష్టము)"గీ.మహీవల్లభుండయనినినిమ్ముగఁజూచితి,,భార.ఆది.౫.ఆ:

ఇమ్ముకొను.శ.అ.క్రి(వసించు) ఉండు,కాపురించు,నడగొట్టు,నిలుచు, నిల్చు,వేంచేయు
ఇమ్ముపప్పు.శ(సంకటము) చూ,అనరు
ఇప్పొయి.1.పా (ఈప్రకారము) చూ,ఇప్పాట
2.పా(ఈశరీరము) [క్క-అ
ఇయ్యి.శ.వై=(ఈవా.అపేక్ష) చూ,౧.అ
ఇయ్యకొను.శ.స క్రి(సమ్మతించు) చూ,౨ ఇచ్చగించు
ఇయ్యకోలు.శ(సమ్మతి) చూ,ఇచ్చగింత
ఇయ్యది.శ.స చూ,ఇది
ఇయ్యసేయు.శ.వై.అ.క్రి(సమ్మతించు)
ఇయ్యెడన్.శ.అవ్య (అత్రార్థకము) చూ, ఇందట [ము) ఈయేడు-
ఇయ్యేఁడు.ప .౧.౫౧ (వర్తమానవత్సర
ఇరవారు.శ.అ.క్రి (స్థిరపడు) ఇరవుకొను, ఇరవుపడు, కుదురు,కుదురుపడు, కుదుర్పడు,జితపడు, జితించు, డెక్కొను, తావుకొను, తిరపడు, నాటుకొను,నెక్కొను,నెట్టుకొను,నెలకొను, నెలవుకొను,పదిలపడు,పాదుకొను, పొందుకొను,పొలుచు
ఇరవు.1.పా(గృహము)చూ,౧ఇక్క-
2.శ(స్థానము)చూ,౨ఇక్క-
3.శ(స్థిరము)చూ,౩ఇట్టలము "క. ఇరవుసిద్ధించుననఘ ఇహపరసుఖముల్,, భార.అర.౪.అ: [వారు
ఇరవుకొను.1.శ.అ.క్రి(స్థిరపడు) చూ,ఇర
2-(నెలకొను,నిలుచు)ఇరవుపడు,కుదురుకొను,కుదురుపడు, కుదుర్పడు, నట్టుకొను,నిలఁబడు,నిలుచు, నిలుచుండు,నిలుచుకొను,నిలువఁబడు, నిల్చు,నిల్చుండు,నిల్వఁబడు, నాలుగొను, నాల్కొను, నెక్కొను, నెప్పుకొను, నెలకొను, నెలవుకొను,పట్టుకొను, పాదుకొను, పాదునిలుచు,మట్టుకొను, మట్టుపడు
ఇరవుపడు.శ.అ.క్రి —పై—
ఇరవుపట్టు.పా(గృహము)చూ,౧ఇక్క-
ఇరస.పా(రెండుకుచములు)ఇరుస
ఇరాలు.శ.స.(ద్వాదశసంఖ్య)ఈరాలు, నల్గిగ,పన్రెండు,పదిరెండు,బార,బారా,ముచ్చాకము
ఇరివిలి.పా.పోగర.
ఇరు.పా.స(ద్విసంఖ్య) ఇరు,ఈరు,జంట, దంట,దుగ,దువ,రెంచ,రెంట, రెండు
ఇరుకెలఁకులు.పా.బ (ఉభయపార్శ్వములు)ఇరుగడలు, ఇరుగెలఁకులు, ఇరుచక్కియలు,ఇరుదెసలు,ఇరుపక్కియలు, ఇరుప్రక్కలు, ఇరుబగులు, ఇరుమయిలు, ఇరుమెయిలు, ఇరుమేరలు, ఇరువంకలు, నూరెలు
ఇరుగడలు.పా.బ—పై— [గు
ఇరుగు.1.శ (ప్రక్కయిల్లు) ఇరవు, పొరు
2.శ(పార్శ్వము)చూ, ౧.అంక "క.ఇరుచెవియెలుఁగకయుండల్,,ఉ.హరి.౫.అ: (దీనికిన్పొత్తి యందంత్యవర్ణలోపము) [నము.
ఇరుగుడు.శ(శింశుప)ఇసవుడు,నల్లదిరిసె
ఇరుగురు.శ.స.చూ, ఇద్దఱు
ఇరుగెలఁకులు.పా.బ.చూ, ఇరుకెలఁకులు.
ఇరుచక్కియలు.పా.బ —పై—
ఇరుచాలుదుక్కి.పా (రెండుచాళ్లుదున్నినదుక్కి)
ఇరుతిగ.పా.స.చూ,౧అలు
ఇరుదంతి.ప.౫.౪ (దంతావళము, ఏనుఁగు)చూ,౨.అత్తి [త్రాడి
ఇరుదలతేజి.వెం.౯౨(మేషము)చూ,అగ్గిత
ఇరుదలపాము.పా(రాజిలము)పూడుఁబాము.
ఇరుఁదలపులుఁగు.శ (గండభేరుండము)ఇరువాయిపక్కి,ఏనుఁగులదిండి.

ఇరుదూము.పా. చూ,ఇద్దుము
ఇరుదెసలు.పా.బ. చూ,ఇరుకెలఁకులు
ఇరునాలుగు.పా.స (అష్టసంఖ్య)ఎనిమిది, ఎన్మిది,దచ్చవుక,దచ్చి
ఇరుపక్కియలు.పా.బ.చూ,ఇరుకెలఁకులు
ఇరుపరువునేల.పా (క్రోశద్వయము) ఇరుపర్వునేల
ఇరుపర్వునేల.భా.౨.౮ —పై—
ఇరుపలము.పా (ద్విపలి) ఇర్పలము,ఇల్లము
ఇరుపేద. పా (అతిదరిద్రుఁడు) నిరుపేద
ఇరుప్రక్కలు.పా.బ. చూ,ఇరుకెలఁకులు
ఇరుబగులు. ప.౧.౫౬ —పై—
ఇరుఁబుట్టువు.1.శ(బ్రాహ్మణుఁడు) చూ, ౧.అయ్యవారు
2.శ (పక్షి) గువ్వ, గ్రుడ్డుకానుపు, పక్కి,పిట్ట, పులుఁగు,పెట్ట [లు
ఇరుమయిలు.భా.౩.౨౫. చూ,ఇరుకెలఁకు
ఇరుమూడు.పా.స.చూ,౧ ఆఱు
ఇరుమెయిలు.1. పా. చూ, ఇరుకెలఁకులు
2.పా(రెండుమేఘములు)
ఇరుమేరలు.ప.౧.౫౬.చూ, ఇరుకెలఁకులు
ఇరులు.శ(అంధకారము) కప్పు,చీఁకటి,చీఁకువాలు,మబ్బు, మయిల,మైల
ఇరులుకొను.శ.అ. క్రి (చీఁకటిపడు)
ఇరులుఁగొంగ.శ (సూర్యుఁడు) ఇవముమేపరి,ఇవమునూడు,ఎండదొర, ఎఱ్ఱనివేలుపు, ఏడుగుఱ్ఱములతేరెక్కుజోదు, కలనఁజావరులతెన్ను, కలువలదాయ,కలువలసూడు, కాఁకవెలుఁగు, కెంపుఱాగాములఱేఁడు,చదలుమానికము,చలిదాయ, చాయపెనిమిటి, చాయమగఁడు, చీఁకటిగుండెదిగులు, చీఁకటిగొంగ,చీఁకటులగొంగ, చెయువులసాకిరి, జక్కవలయంటు, జక్కవలఱేఁడు,జగముకన్ను, జగముచుట్టము, జముతండ్రి,జమునయ్య,తమ్మిచక్కిలిగింత, తమ్మిచుట్టము, తమ్మిదొర, తమ్మివాల్గంటిమగఁడు,తమ్ములవిందు,తామరచెలి,తొగకొమ్మతొలఁగుబావ,తొగసూఁడు, దుగపదిరూపులదుండగీఁడు, నెలజోఁడు, పగటిజోతి,పగటివేలుపు, పగటివేల్పు, పగలింటిదొర, పగలుసేయువలంతి, పచ్చగుఱ్ఱముగలాఁడు, పచ్చవారువపుజోదు,పచ్చవార్వపుజోదు, పనులసాకిరి, పొంజక్కిసామి, పొద్దు,ప్రాఁజదువులపెట్టియ, ప్రాఁబలుకులటెంకి, ప్రాఁబల్కుసొమ్ముపెట్టె,ప్రొద్దు,బారమేనులప్రోడ, బారరూపులవేలుపు, మింటితెరువరి,మినుకులబరణి, మినుకులయిక్క, ముప్పాసవాల్గము, మువ్వన్నెకాఁడు, మువ్వేలుపులయిక్క, మొక్కుసొక్కుసామి,మొదలిగాము, మ్రొక్కులాసవలంతి, రేకంటు, రేవెల్గుజోదు,వినుకెంపు,వినురతనము, వెన్నునివలకన్ను, వెన్నునివలచూపు, వెలుఁగుఱేఁడు, వేఁడివెలుఁగు, వేఁడివేలుపు, వేయిచేతులదిట్ట,వేవెలుఁగు, వేవెల్గు, సతపహుమాదణి,సయితుఁడు,సెకవెలుఁగు.
ఇరువంకలు.పా.బ.చూ, ఇరుకెలఁకులు.
ఇరువండ్రు.శ.స(ఇరువదిమంది)
ఇరువది.శ.స(వింశతి) ఇరువయి,ఇర్వది,
ఇరువయి .శ.స—పై—"ఇరువైనాలుగుమూళ్లమేర,,కాశి.౧.ఆ:
ఇరువాఁగు.పా(ఉభయసేన) [ము)
ఇరువాయికట్టు.శ (మలమూత్రబంధరోగ
ఇరువాయిపక్కి.శ(గండభేరుండము)చూ, ఇరుఁదలపులుఁగు
ఇరువు.1.శ (ప్రక్కయిల్లు)చూ,౧. ఇరుగు
2.శ(పార్శ్వము)చూ,౧.అంశ.
3.శ(స్థానము)చూ,౨.ఇక్క "సీ. నెఱసీటికిరువుపన్నిటిచెఱువు,,శకాం.౪ఆ
ఇరువుడు.శ.చూ,ఇరుగుడు*.

ఇరువురు.శ.స.చూ,ఇద్దఱు.
ఇరుస.శ.చూ,ఇరస.
ఇరుసు.1.శ(రథాక్షము) [య్య)
2.శ (ఏతపుమ్రానిక్రిందినడిమియడ్డుకొ
ఇర్మిగ.పా.స.చూ, ౧ఆఱు.
ఇర్పలము.పా.చూ,ఇ రుపలము.
ఇర్వది.శ.స.చూ, ఇరువది.
ఇర్వురు.పా.స.చూ,ఇద్దఱు.
ఇఱకటము.పా(సంకటస్థలము) ఇఱుకట
ము,ఇఱుకాటము,ఇఱుకు.
ఇఱి. శ.విశే. (ఇఱిసినది) "ఇఱిగొను,,
(వ్యస్తప్రయోగముకనుపడదు)
ఇఱికి.శ (బాలక్రీడావిశేషము) చూ,అం
దలములు
ఇఱిగొను.పా(సూక్ష్మమధ్యము)
ఇఱియు.1.శ.అ.క్రి(సమీపించు)చూ,అం
టసిల్లు
2—(నలఁగు) ఉక్కు, చదియు, చిది
యు,నలియు,నుగ్గు,ముఱుగు, మెదుగు,
మ్రందు,సదమదమగు
3—(సన్నమగు)కొంచెపడు,వలియు,
సన్నగిలు, సన్నగిల్లు, సన్నవాఱు
ఇఱుకటము. 1.భా.3. ౨౬ (సంకటము)
చూ,అనరు
2.శ. చూ,ఇఱకటము
ఇఱుకాటము.శ.చూ,ఇఱకటము
ఇఱుకు. 1.శ. —పై— [రోక
2.శ(కోణము)కోన,గొఱి, గొబ,మూల,
3.శ.అ.క్రి (కొంచెపు తావుననడఁగు)
4—( రెంటిసందునఁజిక్కియదుముడుప
డు)5.శ.అం.ప్రే.(కొంచెపుతావుననడ
చు)6.—(రెంటిసందునజిక్కియదుము)
ఇఱుగుట. ప.౨.౧౧౬ (అపజయము) ఈ
గుట,ఓటమి,ఓటము, ఓటు,ఓడు,ఓ
ల, ఓలచెంగనాలు, చెంగనలు,చెంగ
నాలు,తిరుగు,తిరువు,తిర్గు, తీలుపడుట,
పొల్లతనము,బన్నము, విఱుగబాటు, వి
ఱుగు,విఱుగుడు,విఱుపు
ఇఱుకుమాను.శ (వెలుఁగు లోపలికిఁబో
వుద్వారమునందుఒక్కొక మనుష్యుఁ
డుగాసంకటపడి పోవునట్లుగానాటిన
పంగల గుంజలోనగునది)
ఇఱు ము.శ(మఱు గు,వ్యవధానము) చూ,
౨అడ్డపాటు "వ.ఎడలిఱుములుసందు
లుగంధ్రంబులులేకుండనిండి,, భాగ.౮.
స్కం.
ఇఱుముకొను.శ.అ.క్రి (మఱుగుపడు,తిరో
హితమగు) " ఇఱుముకొనందొడంగెదె
సలేచినచీఁకటిని,, రా.యు.కాం:ఓల
మాసగొను,చాటుపడు, జొడుఁగు,జొ
ఱుఁగు, డాఁకొను, డాఁగు, డుక్కు,
డొంగు,తొఱు ,దండసిలు,దండసిల్లు,
దాకొఁను,దాఁగు, దాఁగుకొను,దొం
గు,పొంచు,పొరయు, బ్రుంగు,బ్రుంగు
డుపడు, మఱుఁగు,మఱుఁగుపడు,మ
ఱు పడు, మాటువడు, మునుఁగు,ము
న్గు, మొఱఁగు,లాఁచు.
ఇఱ్ఱి.శ (హరిణము) "క.మనసిజరాగంబు
నఁబెనఁగినయిఱ్ఱినిలేడిఁజూచి ,,భార.
ఆది.౫ ఆ: జింక,దుప్పి, నులికొమ్ముల
మెకము, పిఱికిమెకము, మెకము,మెగ
ము,లేటి,లేడి
ఇఱ్ఱింకులు.శ.బ(మిక్కిలియింకుటలు)
ఇఱ్ఱిగోరజము. శ (మృగనాభి) కస్తురి,క
స్తురివీణియ,జింకపొక్కిలి,మదము,మె
కపుటాము
ఇఱ్ఱియలు.శ.బ(పార్శ్వము)చూ,౧.అంక.
ఇఱ్ఱిదాల్పుబావ.ప. ౧. ౧౧౮ (విష్ణువు)
చూ, అడుగుచెమ్మటలాఁడు
ఇలకఱచు.శ.స.క్రి (బిగఁబట్టు) ఇల్కఱ
చు,ఈలకఱచు
ఇలకోడి.శ.(ఝిల్లిక) ఈలపురుగు,చిమట

చిమ్మట,చిమ్మిట,చిమ్మెట,రిల్లు.
ఇలవరము. పా (ప్రస్తుతోప యోగ కుటీరము)ఇలారము,ఇలువరము,ఇలువారము, నిలువరము, నిలువారము, నిల్వరము.
ఇలాయి.శ. (కరదీపము) చూ, అగ్గిబోడి
ఇలారము.శ. చూ,ఇలవరము
ఇలి.శ(సిక్థము, అన్నముయొక్క కణము) "ఈఁగకు యిలి పాముకు బలివొరకదు,, మెతుకు, మెదుకు,రెల్ల.
ఇలింద.పా.వై =(ఇంద్రవల్లీ*) ఇల్లంద, ఇల్లింద.
ఇలు.శ.(గృహము) చూ,౧.ఇక్క
ఇలుకు.శ(కీల్లనరముఁబెణకుట) "నా చెయి ఇలుకుపట్టినది,,
ఇలుగు.శ.అ.క్రి (మరణించు) "క.బలవిక్రమఘనులగువా,రిలిగినమన సేన మేదినీశ్వరవినుక,న్నులుచెడినట్లున్నవి,, భార. శల్య.౧ ఆ: ఈలుగు,ఈల్గు,ఉక్కడఁగు, ఉక్కు, ఉక్కుమడఁగు,ఏగు,కడగొట్టు,కడచను, కడచు, కడతేఱు,కిల్లు,కూలు, కెడయు,క్రుంగు,గండడఁగు, గంతుకొను, గతపడు, గిట్టు,గీటడఁగు,గుటుక్కను,చచ్చు,చను, చెల్లు, టెక్కుమెగరగొట్టు, డమ్మను, డింకిర్వేయు,డింకు,తీరు, తుదిముట్టు, తెగటాఱు,తెగు,తెరలు,తెఱలు , తేఱు, తొఱుగు,త్రుంగు,త్రుళ్లు,త్రెగు,త్రెయ్యు త్రెళ్లు,దోరు,నీలుగు, నీల్గు,పడు, పిలుకుమారు, పిలుకుమాలు,పెద్దనిద్దురవోవు,పొడవడఁగు, పొరిమాలు,పొరివోవు,పొలియు,పొలివోవు, పోవు,బిద్దు, బ్రుంగు,మక్కు,మడయు,మడియు,మనుఁగు, మనువు, ముగియు, మునుఁగు, మ్రందు,మ్రగ్గు,రూపడఁగు,రూపఱు, రూపుమాయు,సచ్చు, సమయు
ఇలుదొర.పా (గృహస్థుఁడు) చూ,ఇంటికాఁపు
ఇలునింపుట.పా. (పరిధమువధూవరభవనప్రవేశము)ఇలునింపడము,ఇలునింపతము,జంపతి.
ఇలునింపడము.శ—పై—
ఇలునింపతము.ప.౨.౧౦౩—పై—
ఇలుఱేఁడు.శ(గృహస్థుఁడు) చూ,ఇంటికాఁపు.
ఇలువడి.1.శ(కులీనత)ఇల్వడి.
2.శ(మంచినడత) "ఇలువడిసున్నఁజేసి,,భాగ.౧౦.స్క౦.పూ:ఇల్వడి.
ఇలువరము.1.శ.చూ,ఇలవరము.
2.శ(తృణముచే నేర్పఱపఁబడినపుట్టింటిగూడు)ఇలువారము.
ఇలువారము.శ—పై—
ఇలువరుస.1.పా(గృహక్రమము)
2.శ(వంశానుక్రమము)
ఇలువేలుపు.శ(గృహదైవము)
ఇల్కఱచు.శ.స.క్రి.చూ, ఇలకఱచు "పడిపడియానమిల్కఱచి పట్టుచు,, రా. యు.కాం.
ఇల్లంట్రము.శ(శ్వశురగేహాధివాసము)ఇల్లటము,ఇల్లరికము, ఇల్లఱికము,ఇల్లాటము. [ద.
ఇల్లంద.పా.వై=(ఇంద్రవల్లీ*) చూ,ఇలింద
ఇల్లటము.శ.చూ,ఇల్లంట్రము.
ఇల్లడ.1.పా (అర్పణము) చూ,అప్పగింత
2.పా(కాపురము)ఇల్లడము,విడిమట్టు
3.పా(రక్షణము) చూ,అద్దికము.
4.శ(న్యాసము)
ఇల్లడము.1.పా(అర్పణము) చూ,అప్పగింత
2.పా.చూ,౨.ఇల్లడ.
3.పా(రక్షణము) చూ,అద్దికము.
ఇల్లము.శ.చూ,ఇరుపలము. [దస.
ఇల్లరి.శ(గృహభాగధేయము) చూ,౨.అ
ఇల్లరికము.పా.చూ,ఇల్లంట్రము.

ఇల్ల కము.శ —పై— [క్కర
ఇల్లవ.శ (మత్స్యవిశేషము) చూ, అంబుప
ఇల్లాటము.పా.చూ,ఇల్లంట్రము.
ఇల్లామల్లి.శ (పిశునుఁడు) ఒరుదలకాఁ
డు,కొండగీఁడు,కొండీయుఁడు, కొం
డీఁడు,కొండెకాఁడు, కొండెగీఁడు,
చాడీగొట్టు,చాడీకోరు,తంటలమారి,
తంటాలమారి.
ఇల్లాలు.1.భా.౨.౧౦౫(గృహిణి)గరిత,గే
స్తురాలు.
2.శ(భార్య)చూ,౧ఆలి.
ఇల్లి.శ(ఉపవాసము)ఉపాసము, నంకు,ని
ట్టు,నిట్రు,నిట్రు, నిప్పస్తు, నుంకు, పస్తి
ల్లి,పస్తు,లంకణము,లంకనము.
ఇల్లింద.శ.వై=(ఇంద్రవల్లీ*)చూ,ఇలింద.
ఇల్లిగ్గులు.శ.బ(మిక్కిలి వెనుక కొఱగుట
లు)
ఇల్లిముక్కు.శ (పగిలినెత్తురు కాఱెడిము
క్కులోపలిభాగము)
ఇల్లు.శ(గృహము)చూ,౧.ఇక్క.
ఇల్లెపుచేఁప.పా (మత్స్యవిశేషము) చూ,
అంబుపక్కెర.
ఇల్లెము.శ—పై—
ఇల్వడి.శ. చూ,౧.౨.ఇలువడి
3.పా(ఇంటిమర్యాద)ఇల్వరుస.
ఇల్వరుస.పా.చూ,3.ఇల్వడి.
ఇవక.శ(శైత్యము)చూ,౨.ఇగము.
ఇవతల.శ(అపారము)చూ,ఇద్దరి
ఇవతళించు.శ.అ.క్రి(చల్లనగు)ఇవతాళించు,
చల్లపడు,తనుపారు,తనుపడు.
ఇవతాళించు.శ.అ.క్రి—పై—
ఇవతాళింపు.శ(శైత్యము) చూ, ౨ఇగము
ఇవము.1.శ.వై(హిమము) చూ,౧. ఇగము
2.శ.వై(శైత్యము)చూ,౨.ఇగము.
ఇవముకొను.శ.అ. క్రి (ఆర్ద్రింబగు) తడి
యు,తోఁగు,నాను.

ఇవముమేపరి.శ(సూర్యుఁడు) చూ,ఇరులు
ఇవముసూఁడు.శ.—పై— [గొంగ
ఇవల.శ.చూ,ఇద్దరి. [గిరించు
ఇవిరించు.1.శ.అ.క్రి(పల్లవించు)చూ,౧.ఇ
2.—(అరుణిమమగు)చూ,౨.ఇగిరించు
ఇవురు.1.శ(కిసలయము)చూ,౨.ఇగురు.
2.శ.అ.క్రి(శోషిల్లు) చూ,అడుగంటు
ఇవురుచు.శ.అ.క్రి(పల్లవించు)చూ,౧ఇగిరిం
చు.
ఇవుర్చు.శ.అ.క్రి—పై—
ఇవులుచు.శ.స.క్రి.చూ,ఇగిలించు.
ఇవుల్చు.శ.స.క్రి—పై—
ఇవ్వల.శ.చూ,ఇద్దరి.
ఇసడిలు.శ.అ.క్రి(నిర్వేదించు) చూ,౨.అల
యు"క.ఇసడిలమతి యుఁజనియ, వ్వ
సుధేశుఁడుదండకమునవర్తింపఁగఁదా,
పసహింసాపరులగురా, త్మసులిరువుర
నేనుఁగూడికపటాకృతులన్,,రా.అర
౨.ఆ:
ఇసిరో.శ.అవ్య(నిందించుటను తెలిపెడి) "
ఇసిరోయిదిపోరిపాడియే,, భార.మా.
౧.ఆ:ఇసీ,ఇస్సిరో, ఇస్సీ,ఇహిహీ, ఈ
హీ,హిహీ.
ఇసితింతలు.శ.బ(చలనము)చూ, 3.అదరు
"క.మాపిన్నదియిసితింతల,చూపులన
రగంటవెఱచుచున్నినుఁజూచున్,,నై.
౮.ఆ:
ఇసితింతలువాఱు .శ .అ.క్రి (చలించు)
చూ,౧.అటమటించు.
ఇసీ.శ.అవ్య.చూ,ఇసిరో"ఇసీయిటునాప
వినీనచేసితి,,భార.శాం.౩.ఆ:
2.పా.అవ్య(ఈశ్వరస్మరణమందుగలు
గునది) "ఇస్సీరయెంతలుపుట్టె శీతకిర,
ణుండిట్లేచు నేరాధికన్,,వై:ఇస్సిరో
ఇస్సీ.
ఇసుక .శ.ఏ(సికత) ఇసుము, ఇసుఱు,

ఉసుక,క ఱకుదుమ్ము. [కము

ఇసుకదాసరి.శ(ఒకదినుసుకూర,సైకతశా

ఇసుకదిన్నియ.శ(ఇసుకదిబ్బ)ఇసుకదిన్నె.

ఇసుకదిన్నె.శ—పై— [అంబుపక్కెర.

ఇసుకదొంను.శ (మత్స్యవిశేషము) చూ,

ఇసుకపులకండము.శ(మత్స్యండి)కండ,కండచక్కెర,పటికబెల్లము,పులకండము,పులుకండము.

ఇసుకబేలు.శ(ఒకానొకతీఁగ)

ఇసుకమ్రాను.శ(వరుణము*)ఉలిమిడి,ఉలిమిరి,మావెలఁగ,మొగలింగ.

ఇసుమంత.భా.3.28.అవ్య (ఈషదర్థకము) చూ,ఇంచుక.

ఇసుమంతకాఁక.సాం.౧.౨౧(కదుష్ణము) ఒకింత వేఁడిమి,కనువెచ్చ, గోరువెచ్చ, గోర్వెచ్చ,తనివెచ్చ,నులివెచ్చ, నులివెచ్చన.

ఇసుము.శ.ఏ.చూ,ఇసుక.

ఇసులు.సాం.3. ౧౨—పై—

ఇసుళ్లు.శ.బ(పక్షపల్మికి,రెక్క చెదలు)ఉసిళ్లు,ఉసుళ్లు.

ఇస్తువు.శ(స్వామ్యము)సొత్తు,సొమ్ము.

ఇస్సిరో.1.శ.అవ్య.చూ,ఇసిరో.
2.పా.అవ్య.చూ,౨.ఇసీ.

ఇస్సీ—పై—

ఇహిహీ.1.శ(నవ్వుటయందగుధ్వన్యనుకరణము)చూ,అసురుసురు"ఇహిహీయనినవ్వెమదంబుపెంపునన్",,రుక్మి.3.ఆ:
2.శ.అవ్య.చూ, ఇసిరో."క. మగఁటిమిగలరాచచంద మాయిహిహీ" రామా.౫.ఆ:

ఈ

ఈ.ఒకయక్షరము.శ.స (ఎదుటనుండుదానినితెలుపును)"ఈతపము" [డుజాతి)

ఈంఁడ్ర.శ (తాటిచెట్టులోనగువానిగీఁచె

ఈంఁడ్రము.శ(పీడనము)చూ,అదుముడు.

ఈంఁడ్రవాఁడు.శ(తాళసారగ్రాహి)ఈడిగ, ఈడిగవాఁడు, గవుండ్లవాఁడు,గౌండ్లవాఁడు,చిటిగాఁడు,మొక్కలి. [ట్టు.

ఈంఁడ్రించు.శ-స.క్రి (పీడించు)నలఁగుకువె

ఈఁక.శ(పక్షియెఱక)ఎఱక,గఱి,చట్టుప, చెట్టుప,డాఁక,సెఱి, రెక్క, ఱెకు, లాక.

ఈకప.పా.చూ,ఇద్దెస.

ఈఁకు.శ.అ.క్రి(శోషిల్లు)చూ,అడుగంటు.

ఈకరణి.పా(ఈవిధము)

ఈకువ.శ (ఆర్ద్రత,తడి) ఈమిరి, ఊట,చెమ్మ,చొరుగు,తడి,తనుపు,తన్పు, తెమ్మ, తేమ,తోఁగు, నెమ్ము,పంకెన,పదను.

ఈకె.శ.స(ఈపూజ్యస్త్రీ)ఈపె, ఈమె, ఈబిడ,ఈబిడె,ఈయమ,ఈయమ్మ.

ఈకెలదారము.పా.(పందెపుకోడిపుంజులలోభేదము)చూ,అరజాట్టు [చ్చగించు.

ఈకొను.శ.స.క్రి(సమ్మతించు) చూ,౨.ఇ

ఈకోలు.శ(సమ్మతి)చూ,ఇచ్చగింత.

ఈగడ.శ(జాడ)చూ,అమాకి.

ఈఁగ.శ(మక్షిక)ఈఁగె,ఈవ,ఈవె.

ఈఁగపులి.శ(లూతాభేదము)విందుపురుగు

ఈగి.1.శ(త్యాగము,దానము) ఈవి,ఒసఁగు,చాగము,తెగువ,తేగము,దార,పుడికిరింత,పుడిగ,పుడుకరింత, పుడుకు,పుడుగ, పుణుకు,పెట్టు,పెట్టుడు, విడుపు,విడ్పు.
2.పా(చతురుపాయములలోనిదిరెండవది)a.మంచి,b.ఈగి,c.వేలు ,d.కొట్టు.

ఈఁగు.1.శ.అ.క్రి(ప్రవేశించు)"క.ఈగంగాదికతీర్థములీఁ గంగా" పాండు.౧.ఆ:ఎలయు,ఒలయు, కూరుకొను, కూర్కొను, చొచ్చిలు, చొచ్చిల్లు, చొచ్చు,చొత్తెంచు, చొరఁబడు, చొరఁబాఱు,తటారించు,తూకొను,తూఱు,

దూయు,దూఱు , నడుచొచ్చు, పొల
యు,లోగు,లోవు.

.శ.స.క్రి(నివర్తిల్లు)" ఎ.గీ.ఎల్లభంగు
లమాభంగమిూఁ గుమభవ,, భాగ. ౬.
స్కం:నీఁగు.

ఈగికాఁడు.శ(దాత)ఈవరి,ఈవికాఁడు,
చాగకాఁడు,చాగి,తెగుదారి,విడుపరి.

ఈగిమ్రాను.శ(కల్పవృక్షము) ఈవులమ్రా
ను,కడలికానుపు,జాల్మొలక,తెఱగం
టిమ్రాఁకు, తెల్లమ్రాను, పుడుకుమ్రా
ను,పెట్టుఁజెట్టు,మింటిజెట్టు,మెచ్చుల
చెట్టు, వాడనిపువ్వుల మ్రాను, విను
మ్రాను,వెలిమ్రాను,వేలుపుఁజెట్టు.

ఈగు.శ.అ.క్రి(వెనుకకొఱగు)చూ,ఇగ్గు"
ద్వి.ఈగిదిక్కరులు ఘీంకృతులొసరిం
చెఁ,గ్రాఁగినయసురులగలినబ్బులింకె"
రా.యు.కాం. [ఱుగుట.

ఈగుట.1.ప.౨.౧౧౬(అపజయము)చూ,ఇ
2.పా(పోఁగొట్టుట)
3.పా(ఓర్చుట)
4.పా(ఒదుగుట)
5.పా(డయ్యుట)
6.పా(దూరుట)

ఈఁగె.సాం.ర.౧౩.చూ,ఈఁగ.

ఈచ.1.శ (వక్రము) "ద్వి.కాలకాశికుఁడ
నఁగాఁ బేరువడసి, కాలీచఁ జనుచు"
హరిశ్చ.౨.భా:ఈఱతాఱు, ఏచ, ఏట
వాలు,ఏస,ఒరగు,ఒఱగు, ఒఱవ, ఒత్తి
య,కొంకర,గోడి,చొక్కిలి, చొట్ట,
డొంకు,నెరి,నెఱి,నెఱులు,మలఁక,రో
టు, వంక, వంకర,వంపు, వక్కరము,
వాఁక,సొట్ట.
2.పా(కణిశవృంతము)ఊచ.
3.పా(బలహీనము) [నునది.

ఈచకొనునది. పా (అపలోక) ఈచుకొ
ఈచుకొనునది.భా.౨.౨౬౩—పై—

ఈచపడు.శ.అ.క్రి (వక్రమగు)"గీ.అధిప
కాలీచపడఁ గనుగ్రాట పులకునరిగి"
పంచ.నా.౧.ఆ:ఈచఁబోవు,గోడివడు,
చొక్కిళ్లువోవు,మలఁగు,రోటువోవు,
సంకరవోవు.

ఈచఁబోవు.శ.అ.క్రి—పై—

ఈచు.శ.అ.క్రి(శోషిల్లు) చూ, అడుగంటు

ఈచుకపోవు .శ.అ. క్రి (చావుదూడవే
యు)

ఈఁజేటి.శ.చూ,ఇంజేటి*.

ఈఁటియ.శ (కుంతము)చూ,అత్తలము.

ఈటు.1.శ(వ్యర్థము)చూ,౨.అటమట.
2.శ(శూన్యము)ఊత్త, ఊళక్కి,ఎద్దడి,
కుందేటికొమ్ము,గొడ్డు,చెనఁటి, చెన్నఁ
టి,దోయిడి, నిప్పచ్చరము,బరిగి, బయ
లు,బీడు,రిత్త,రుత్త,లేబరము, లొటార
ము,వట్టి,సోళు.

ఈటువోవు.1.శ.అ.క్రి(వ్యర్థమగు)చూ,౧
ఆఱడిపడు.
2—(శూన్యమగు)

ఈఁటె.శ(కుంతము)చూ,అత్తలము.

ఈఁటెకాఁడు.శ(కొంతికుఁడు)

ఈడ.1.పా(నాగరంగము*) దబ్బ, నారద
బ్బ,నారదము,నారింజ.
2.శ(ఈవోటు)
3.శ(పారేవతము*)ఈడె

ఈడట.భా.౩.౬౬.అవ్య (అత్రార్థకము)
చూ,ఇందట

ఈడఁబోవు.శ.అ.క్రి (అపక్రమించు,వెన్ను
దీయు) చూ, ౧ అయిదుపదిచేయు.
"ఈడంబోవకవీఁక మైఁబొడువగా"
భార.ఆది ౧ ఆ

ఈడాడు.శ.స.క్రి (ఎదురు, మార్కొను)
"ద్వి. ఓడకోడకుదేవి యుగ్రశాత్రుసు
న్ని, నీడాడినీచెఱనే విడిపింతు"రా.అ
ర.కాం: ఎదిరించు,ఎదురు, ఎదురుకొ

ను,ఎదురుచు,ఎదుర్చు,చెనకు,చెనయు, డీకొను,తలపడు, తొడరు, దాడియాడు,దీకొను,మార్కొను, మాఱు కొను,ముదలకించు, ముదలించు, మెండొడ్డు,రాయు

ఈడిక.1.శ (కంటకాదిభారము) ఈఁచ,ఎట్టము,కంప,క్రంప,తొడుగఱ,తొడుగట్టి,తొడుగు,తొడువు,తొడ్గు,సుడుము
2.శ (తృణాద్యానయన సాధనవిశేషము) చరుగుడు,సరవడి.

ఈడిగ.శ.చూ, ఈంద్రవాఁడు

ఈడిగవాఁడు.శ —పై—

ఈడిగిలఁబడు. శ.అ.క్రి (భయాదులచేరానని మొండివేసికొనికూర్చుండు) ఈడిగిల్లు,ఈడ్గిలఁబడు

ఈడిగిల్లు.శ.అ.క్రి —పై—

ఈఁడు.శ.అప (కల అనుఅర్థమునందువచ్చెడిఒక ప్రత్యయము) "ఆగడీఁడు" మొ.

ఈడు.1.శ (ప్రాయము) జవ్వనము,పరువము,ప్రాయము
2.భా.౨.౧౧౭ (యౌవనము) ఈడుప్రాయము, కొమరుఁదనము, కొమరుఁబ్రాయము,గోవ,జవ్వనము, తఱపి,నీరుప్రాయము,పడుచుతనము,పరువము, పర్వ్ప్రాయము
3.పా (అధి) చూ,అగావు
4.శ (సమానము) చూ,౩అనుగలము
5.పా (జీవితకాలము)
6.శ.అ.క్రి (వీడు,చ్యుతమగు) "గీ.శర్ధగలిగిలోకసంగ్రహసంగంబు, నీవు విడిచియొవ్వఁడీయుప్రాయ,ముల భజించువాఁడు మోక్షలక్ష్మీపతి, యగునొకింత సందియంబువలదు" భార.అశ్వ.౧ ఆ: ఊరలు,ఊరలుకొను, ఊడు,జాఱు ,వదలు, విడియు, విడివడు, విడివోవు,విడు,విడువడు,విరియఁబడు,విరియఁబాఱు ,విరియు ,వీడు,వీడుకొను, వీడ్కొను,ప్రీలు,సడలు,సళ్లు [చను
7.—(దీర్ఘమగు) చాఁగు, నిగుడు,నిడు
8.శ.స.క్రి (పాలుపిండు) "క.గోవుల కుంగ్రేపుల విడువకయు విడిచి విడిచి యీడకయు,యీడియీడియీడినపాలుకొఁచకయు." భాగ.౧౦. స్క౦.
పూ: పిండు,పితుకు,పిదుకు

ఈడుచు.శ.ప్రే (ఆకర్షించు)

ఈడుపడు.శ.అ.క్రి(సమానమగు)

ఈడుప్రాయము.పా.చూ,౨ ఈడు

ఈడుపు.1.శ (ఆకర్షణము) లాగు
2.శ (విలంబనము)
3.పా.(ద్వారపార్శ్వము)

ఈడుపులు.శ.బ(బుగడలగొలుసు) [వు

ఈడుఁబోవు.శే.౧౨.అ.క్రి.చూ,ఈడఁబో

ఈడుమాఱు.శ.అ.క్రి (వర్ధిల్లు) చూ,౫ఆడరు [మను

ఈడేఱు .1.శ.అ.క్రి(సిద్ధించు) చూ,౫అ
2—(సఫలు) చూ,౫.అడెరు."కొంతినీడేఱగా.,,సై.౨.అ.

ఈడ్గిలఁబడు.శ.అ.క్రి.చూ,ఈడిగిలఁబడు.

ఈడుముంత.శ (పాలుపితుకు పాత్రము)

ఈడె.శ. చూ,౩.ఈడ*

ఈఁత.1.పా (ఖర్జూరిక*) చూ,౩ంఖి
2.శ.(ఈఁదుట)
3.శ (పశ్వాదిక ప్రసవము) ఈనిక

ఈఁతకాఁడు.శ. (ఈఁదెడువాఁడు)

ఈఁతకొట్టు.శ.అ.క్రి(ఈఁదు) ఈఁదు,ఈఁదులాడు

ఈతఁడు.శ.స.ఏ. చూ,ఇతఁడు

ఈతగాఁడు.శ.స. —పై—

ఈతల.శ (అపారము) చూ,ఇద్దరి [ర.

ఈఁద.1.శ (శీతవాయువు) చూ,అల్లితెమ్మె
2.పా చూ, ఇఁదు*.

ఈఁదర.శ.చూ,అల్లితెమ్మెర

ఈఁదాడి.పా.వై =(హింతాలః*)ఈఁదాడు,ఈఁదు,గిఱకతాడు
ఈఁదాడు.శ.వై.= —పై—
ఈఁను.1.శ.(వాయువు) "క.ఈఁదునకుం గావెలికొమరుఁడ." అచ్చ.సుం.కాం: ఎదచూలి, ఒంటిమ్రాకుల పెనుముప్పు, కరువలి,కర్వాలి, గంధపుఁగొండతెంకి, గాడుపు,గాడ్పు,గాలి, చలిపట్టు,చలియిక్క, చిలువమేఁత, జింకగుఱ్ఱమువలంతి,జింకరవుతు,తావిమోపరి, తెమ్మెర, మవ్వగాఁవించుజాణ,నింగిచూలి,నీటితాత,నెత్తమ్మికొలనికాఁపు, పయర,పయిర,పయ్యర, పాముమేఁత,పైర,బీదలపెనుపాద,మబ్బుపగ, మబ్బుమేపరి, మబ్బువిప్ప,మరుత్తేసు, మింటిచూలి,మినుచూలు, వలపుమోపరి,వలి, వినుచూలి,విన్నుచూలి,వీవలి, సుడిగొట్టు,సుడిగొట్టుజాణ,సుర,సుంటిపీవనులఁబట్టు, సోఁకు,సోఁకుదయ్యము.
2. పా. చూ,ఈఁదాడి.*
3. శ. చూ, ఇందు*.
4.శ.అ.క్రి.చూ,ఈఁతకొట్టు
5.శ.స.క్రి.(దాఁటు,తరించు)ఒడ్డు,కడచను,కడచు,కడవెళ్లు, జంగగొను,తెజియు,దాఁటు
* ఈఁదురు.చం.గ్రా.(తుపానుగాలి)
ఈఁదులాడు.1.శ.అ.క్రి. చూ,ఈఁతకొట్టు
2.—(వ్రేలాడు,ఆందోళించు)"ఎ.గీ. ఈఁదె పోటులఁ బడి పేరివులీఁదులాడ.,, స్వా.ర.ఆ: ఉరియాడు, ఊఁగాడు,ఊఁగు,ఊఁగులాడు,ఊవాడు,ఊవు,తుంపెసలాడు,తూఁగాడు,తూఁగియాడు,తూఁగు,దింపులుపోవు,బిత్తరించు,వేలు, వ్రేలఁబడు, వ్రేలాడు,వ్రేలియాడు,వ్రేలు,వ్రేలుకాడు
ఈన.శ.(పత్రినాడి)ఈనియ,ఈనె,పారక

ఈనము.చం.గ్రా.వై(తక్కువైన,నీచమైన)
ఈనరాసి.చం. గ్రా (పూర్ణముగాఁబండిన వస్త్రరాశి)
ఈనిక. శ. చూ, 3. ఈఁత
ఈనియ. శ. చూ, ఈన
ఈను.1. శ.స.క్రి (పశ్వాదులుప్రసవించు)
2— (కలిగించు) "దశదిక్కులుబ్రతి, ధ్వానములీనఁగా ,,జై.౨.ఆ:
ఈనె.శ.చూ,ఈన
ఈనెగాజులు.శ.బ. (బాలికాక్రీడావిశేషము)చూ,అంజి
ఈపి.శ.(లీక్షు)ఈరు, పేనుగ్రుడ్డు, పేనుపిల్ల
ఈపె.శ.స. చూ,ఈకె [ద
ఈబరి.శ.(అప్రయోజకుఁడు) చూ,అంబే
ఈబరిగొట్టు.శ. —పై—
ఈబిడ. శ. స. చూ, ఈకె
ఈబిడే. పా. స. —పై—
ఈమిరి.శ.(ఆర్ద్రత్వము)చూ,ఈకువ
ఈము. 1.శ.చూ,౨.ఇగము
2.పా (ఒసంగము)
ఈమె.శ.స. చూ, ఈకె [క్క—అ
ఈయ.శ.వై=(ఈహా,అపేక్ష)చూ,౧.అ
ఈయకొను.శ.స.క్రి. చూ,౨.ఇచ్చగించు.
ఈయకోలు.శ.చూ,ఇచ్చగింత
ఈయది.శ.స. చూ,ఇది
ఈయన.శ.స.ఏ. చూ, ఇతఁడు
ఈయమ.పా.స.చూ, ఈకె
ఈయమ్మ.పా.స.—పై—
ఈయేఁడు.శ.చూ,ఇయ్యేఁడు [కటము.
ఈరతార.పా(వ్యత్యయము)చూ,అకటవి
ఈరము.1.శ.(నికుంజము)తీఁగయిల్లు,తీఁగెయిల్లు,పొద, పొదరిల్లు, పొదరుటిల్లు.
2.భా.౨.౩౬.(గుల్మము) ఈరాలు,ఈఱమి,ఈఱము,గుండు, చెట్టు, జట్టు,జీబు,డొంక,తుప్ప,పుట్ట,పొద,పొదరు.
ఈరస.1.శ.వై.=(ఈర్ష్య, ఓరువలేనితన

ము)ఈరసము,ఈసు, ఊద,ఊసివాసము,ఎరుసు,ఓర్వమి, కడుపుమంట, కడుపుఁబ్రాఁద, కనుకుట్టుఁదనము, కొంతాళము,నూడు. [ములు.

2.శ.వై(కోపము)చూ, ౨.అంకపాంక

3.శ.వై(ద్వేషము)చూ,3.అంకపాంకములు.

ఈరసము.శ.వై=(ఈర్ష్య)—పై—

ఈరసించు.1.శ.వై.అ.క్రి(ఈర్ష్యపడు) కొంతాళపడు.

2—(కోపించు)చూ,అచ్చలించు.

3—(ద్వేషించు)ఒడ్డారించు,కంటగించు, పగగొను, మచ్చరించు, మచ్చరికించు,నూడించు,నూడుకొను

ఈరాఱు.శ.స. చూ,ఇరాఱు .

ఈరాలు.పా.బ.,చూ,౨. ఈరము.

ఈరిక.1.పా(శకలము) చూ,౧అరవరలు.

2.శ(అంకురము)చూ,౧ఇగురు.

3.పా(కిసలయము)చూ,౨.ఇరుగు.

ఈరు1.శ(లిక్షు)చూ,ఈపి.

2.పా.చూ,ఇరు.

3.శ (అల్పము)చూ,౨.అన్నువ.

4.శ(హీనము)చూ,౨.ఆలి

ఈరుచు. శ.స. క్రి (ఆకర్షించు) ఈర్చు; ఒడియు, చేదు, తిగియు, తిగుచు, తివియు, తివుచు, తోడుకు, నిమురు, నుసుము, రెమ్మ.

ఈర్చు.శ.స.క్రి—పై—

ఈరుపెన.శ(లిక్షావికర్షి)ఈర్పెన

ఈరువాఱు.శ(విహారము)చూ,అసివాఱు.

ఈరువు.శ(మాంసము)చూ,అరుచి

ఈరె.శ(పంటెముజుట్టితీసిననూలు)

ఈరెండ.శ(కించిదాతపము)నీరెండ.

ఈరెలుఁగు.శ(హీనకంఠధ్వని)కుఱుచ,గువ్వకుత్తుక,తీఁగయెలుఁగు,తీఁగెయెలుఁగు.

ఈరేడు.శ.స(పదునాలుగు)

ఈరేను.శ.స(దశ)ఈరైదు,పది,బంతి.

ఈరైగు.పా.స—పై—

ఈర్పెన.శ.చూ,ఈరుపెన.

ఈఱతాఱు.1.శ.బ(వక్రిము)చూ,౧.ఈచ“గీ.ఈఱతాఱతలంపులబీఱువాఱ,, భార.అశ్వ.౧.ఆ:

2.శ.బ(పరుషము)“ఎ.గీ.మరలెదుర్మర్షణుఁడుతోనతెరలెసేన,యపుడుసమ్మెటకోలలనంకుశములఁ,జేఱు కోలలవ్రేటులనీఱతాఱ,యదలుపులవాహనంబులుచెదరిపఱచె,,భార.ద్రో.3.ఆ:కంకర,కరసు,కఱకు,కఱు కు,క్రొవ్విదము,గంఁడ్రలు,చిడిపి, దురుసు,పరుసఁదనము,పరుసన,పరుసనము,పరుసు, పలుసము,పిఱుము,ప్రల్లదము,మొఱకు,మొఱ్ఱ

ఈఱమి.1.శ (గుల్మము) చూ, ౨. ఈరము“ వ. పూఁ బొదరిండ్లయీఱమిమఱుంగున,,కళా.౧.ఆ:

2.శ(సాంద్రము)“ ఈఱమిగాఁకచిమ్మచీఁకటుల్,,చూ,ర.అచ్చము.

ఈఱము.శ—పై—

ఈల.1.పా(తస్కరసంకేతధ్వని)

2.శ(లజ్జ)“విడువుమీలయటంచునొడివెహేమ,,స్వా.౩ఆ:కసరు,కసురు,నాన,పుచ్చటిక, పుచ్చడిక, పుచ్చడీక,పుచ్చడీకతనము, పుయిలోటు,బిడియము,బిడెము,బొసుకు,లగ్గు,సిగు,సిగ్గు, సిబ్బితి.

3.పాం.౨.౨౧(అపదేశము)ఓల, నెపము,నెవము,వఱుకు,సాకము.

4.శ(ఒకదినుసుపుల్లగానుండుకూర)

5.శ(చిమ్మటకూఁత) [ని)

6.శ (గోపకులులోనగువారిసంకేతధ్వ

ఈలకఱచు.శ.అ.క్రి. చూ,ఇలకఱచు.

ఈలకూఁతలు.శ.బ (బాలక్రీడావిశే.)ము

చూ, అందలములు.
ఈలగ్రద్ద. 1. శ. (లోభి) చూ, ౨. అడియరి.
2. శ (శ్యేనభేదము) చూ, అడుజా.
ఈలపురుగు. శ. చూ, ఇలకోడి.
ఈలాగు. పా. చూ, ఇప్పాట.
ఈలుగు. శ. అ. క్రి (మరణించు) చూ, ఇలుగు. "క. పవనసుతు చేతనాభూ, ధవుఁడీలిగె నేని,, భార. కర్ణ. ౨. ఆ:
ఈలువు. 1. శ (సాత్త్రవత్యము)
2. పా (అభిమానము)
ఈల్గు. శ. అ. క్రి (మరణించు) చూ, ఇలుగు.
ఈల్గుట. భా. ౨. ౨౨౫. (మరణము) కడ, క్రుంకుట, గిట్టింపు, గీటడంగుట, చక్కఁడగుట, చావు, తుది, తెగుట, త్రుంగుట, త్రెళ్లుట, పెద్దనిదుర, పెద్దనిద్దుర, పెన్నిదుర, పాలి, పాలియిక్క, మడియుట, మిత్తి, వీడుకోలు, వీడ్కోలు, సమయుట, సావు
ఈవ. శ. చూ, ఈఁగ
ఈవంక. పా. చూ, ఇద్దెస
ఈవరి. శ. (దాత) చూ, ఈగికాఁడు
ఈవల. 1. శ. చూ, ఇద్దరి.
2. శ. చూ, ఇటుపిమ్మట
ఈవి. శ. (దానము) చూ, ౧ ఈగి.
ఈవికాఁడు. శ (దాత) చూ, ఈగికాఁడు
ఈవు. శ. స (నీవు)
ఈవులమొదవు. శ. (కామధేనువు) చూ, అడిగిననొసఁగెడియావు
ఈవులమాఁను. శ. చూ, ఈగిమాఁను
ఈవులరతనము. శ (చింతామణి) చాగరతనము, జేజేలమానికము, తలఁపుమిన్న, తలఁపురతనము, తలఁపుఠాయి, వుడుకుగల్లు, వినువారలమానికము, వేలుపుమానికము
ఈఁవె. సాంర. ౧౩, చూ, ఈఁగ.
ఈశ్వరప్రియములు. పా. బ (ధాన్యవిశేషము) చూ, అక్కుళ్లు.
ఈసడము. శ (నింద) చూ, అగడారు.
ఈసడించు. 1. శ. అ. క్రి. చూ, అసహ్యపడు "గీ. అంతనొకనాడునిర్మలస్వాంతమాని, మౌళిభుజియింపఁబాత్రలో ప్రేలుదుని సి, పడినమదినీసడింపకకడకుఁదిగిచి, వైచిభుజియించెనప్పతివ్రతలతల్లి,, పాంచా. 3. ఆ:
2— (కోపించు) చూ, అచ్చలించు "హెచ్చునట్టిపే, రీసుననీసడించుచు" కళా. 3. ఆ:
3. శ. స. క్రి (నిందించు) చూ, అడిపోనికొను "సీ. చండాలుఁడని సారెసారెకున న్నునీవీసడించుటపాటియేతలంప,, హరిశ్చ. ౪. ఆ:
ఈసడింపు. 1. పా (నింద) చూ, అగడారు.
2. పా (తిరస్కారము) చూ, అలచు.
3. పా (చులకదనము)
ఈసపిట్ట. శ (మత్స్యవిశేషము) చూ, అంబుపక్కెర
ఈసరుఁడు. 1. పా. వై= (ఈశ్వరః, శివుఁడు) చూ, అంగమొలవేల్పు
2. పా (దేవుఁడు)
ఈసలు. భా. ౨. ౯౫. బ (వల్మీకమక్షిక)
ఈసు. 1. శ. వై =(ఈర్ష్య) చూ, ౧ ఈరస
2. శ. వై (కోపము) చూ, ౨ అంకపొంకములు
3. శ. వై (ద్వేషము) చూ, 3 అంకపొంకములు
ఈసుకాఁడు. శ. వై (ఈర్ష్యాళువు) ఉడుకుఁబోతు, ఏవకాఁడు
ఈహీ. శ. అవ్య. చూ, ఇసిరో. "తక్కనబలాధీశాఖ్య కీటంబులిం, దెవ్వాండెవ్వఁడో మేలెచేటొటుఁగరీహీ,, కవిక. ౨. ఆ

## ఉ

ఉ. ఒకయక్షరము. [గవించు.

ఉంకించు .స.అ.క్రి (యత్నించు) చూ, అం

ఉంకింపు .1.పా(యత్నము) చూ, ఆయత ము.

2.పా (విజృంభణము) ఉప్పెన,ఎసక ము,ఏడ్తెఱ,ఏపు,ఏస,కయిపు, కేరుపు, కైపు,కొప్పరము, గుంపెన,గోటాపన, చిందఱ,చీఁదఱ,డాక, వళావళి, వీక.

3.పా(కుప్పింపు)

ఉంకు.1.స(సమ్మతి) చూ,ఇచ్చగింత "క. ఎక్కువకులంబున నతివికి, నిక్కపుటా లైనదాని నీచకులుండుం,క్కకబలిమిం గవిసినఁ, దక్కని చంపుటయరాజధ ర్మంబెంచఁగన్",విజా.ప్రా.కాం

2.స.అ.క్రి(ఎగురు,ఉత్పతనమగు)"ఉం కుచెండువిధంబున,,ఉ. హరి.ర.అ:ఉ ఉుకు,ఎగయు,ఎగసిపడు,ఎగసిల్లు,ఎగు రు,ఎవయు ,గోరించు,జరగు,జరుగు,జా ఱు,త్రుళ్లగించు,త్రుళ్లియాడు, త్రుళ్లు, దాఁటు,దుముకు,దూఁటుకొను, నెగ యు,నెవయు,పల్లటీల్గొను, పల్లటీల్గొఁ టు,పల్లటీల్వైచు,మిట్టించు, మిట్టిపడు, మిట్టు,మిడియు,మిడిసిపడు,మిడుకు,మి డుకుమాలు,లాఁగించు.

ఉంకుటుంగరము.స(వధూవరులు పెండ్లిచేసి కొనుటకుపరస్పరముసమ్మతించిమార్చు కొనెడియుంగరము)

ఉంకుడు. పా ( కన్యా శుల్కము ) ఉంకున,ఉంకువు,ఓలి,పయిఁడి,పైఁడి, ప్రండి,సంకు,సంకుడు,సుంకము.

ఉంకువ.పా—పై—

ఉంకువు.పా—పై—

ఉంగ .స (బిడ్డలకుఁబోసెడుచనుఁ బాలా ముదము) "క. అంగములు మిగులనలి యఁగ,నుంగయుం గేయటంచు నొకని మిసమునో, రంగాయ వేయకే ద్దుచు, నంగీకృతబాల్యచేష్టనతఁడట్లుండన్,,ప ర.౧.ఆ:ఉగ్గు,కంగు.

ఉంగరపువ్రేలు.స(అనామిక) దబ్బవ్రేలు.

ఉంగరము.స.వై.చూ,అంగుళీయకము.

ఉంగడి.పా (పశువ్యాధిభేదము) చూ,అ దురుదిక్క.

ఉంగిడి.స—పై— [టము.

ఉంగుటము.స.వై=(అంగుష్ఠ) చూ,అంగు

ఉంగ్రము.స.వై.చూ,అంగుళీయకము.

ఉంచు.1.స.ప్రే.(ఉండఁజేయు) ఉనుచు.

2.భా.3.౧౩౦స.క్రి(కీలించు)తగులఁగ ట్టు,తగులఁబెట్టు, పెట్టు, వేయు.

ఉంచుకొను.స.ప్రే(పెట్టుకొను)

ఉంట.1.స.(గోళకము) ఉండ,గుండు.

2.స(ఉండుట)

3.స(వస్త్రులము) ఉండ,ఉండ్రము,గుం డ్రము,గుడుసు, బటువు, బవిరి,బద్రి,వ ట్రు,వట్రువ.

ఉంటగాలము.స (సీసపుగుండుకట్టినయొక దినుసుగాలము) తద్భేదము —గోరుగాల ము.

ఉండ.1.(గోళకము) చూ,౧.ఉంట.

2.స(వస్త్రులము) చూ,3.ఉంట.

ఉండక్రోవి.స (యోగివేత్రము) లాతము, లాతాము.

ఉండసురియ.స (ఆయుధవిశేషము)తద్విశే షములు:— కట్లగుదియ, కరిచిలుకు, కొరడు,కోల,గుమిక్రి, గుమ్మిక్రి, చింగో టి,చికటారి, చిక్కటారి,చిప్పకత్తి,జ ముదాడి, డొంకెన, తగుకత్తి,దసెన, దొంకెన, దోచుముదారి, మొహచా, సత్తి,సామంతరాగోల, సిరాణము.

ఉండి.1.స.అప(ఒకప్రత్యయము)

2.శ.అవ్య.(మొదలుకొని అను నర్థము తెలుపునది.)

ఉంచు.1.శ.అ.క్రి.(వసించు) చూ, ఇమ్ముకొను.

2.—.(వర్తించు) కొల్లు, ప్రబ్బు,మను,మాడు,మెలఁగు,మెలయు.

3— (శేషించు)నిలుచు,నిల్చు,మిగులు.

ఉండువాఁడు.పా.(వస్త్రఘ్నఁడు.)

ఉండె.పా.(ఊరుమూలదేశము.)

ఉంద్ర.శ.(కదరము*)ఉంద్రస, ఉంద్రైన, వెలిచంద్ర.

ఉంపెళ్ళము. శ .చూ, 3 .ఉంట.

ఉంద్రములు.శ.బ. (మోదకములు.) ఉండ్రాళ్లు,కుడుములు.

ఉంద్రస.శ.చూ,ఉంద్ర.

ఉండ్రాలు.శ.బ.చూ,ఉంద్రములు.

ఉంద్రైన.శ.చూ,ఉంద్ర. [నట.)

ఉంపడము.1.శ. (గుత్తగా వేశ్యనుంచుకొ

2.చం.(ఉంచుకొనఁబడిన వేశ్య.)

ఉంబ.శ.వై=(అంమ్బా, గోవులయంభారము.) చూ,అంబే.

ఉంబళి.శ. (పన్నులేనిది.) "ఉంబళిగ్రామము."

ఉక్క.1.పా(క్రీరుఁడు) ఉక్కుతునియ,ఉరియు,ఉటియ, గడుసరి, గద్దటికాఁడు, గాళికుఁడు,గుండా,తుటారికాఁడు,దంట,దట్టుఁడు,దిటవరి,దిట్ట, దిట్టఁడు,దిట్టరి. 2.శ(ఊష్మము)చూ,3.ఆవి.

ఉక్కడఁగు 1.శ.అ.క్రి. (ఉక్కుచెడు.) "గీ. మహీజంబులెక్కరందుఁగొందఱుక్కడంగి." భార. అర.౨.ఆ:ఉక్కఱు ,ఉక్కుమడఁగు.

2—.(మరణించు) చూ,ఇలుగు.

ఉక్కడము.1.శ.వై. విణ=(ఉత్కటః,పృథువు,పెద్ద) "ఉ.ఉక్కడమైనమంచి హానువొప్పెడు నాహయరత్న మెక్కి—నక్." సా.౧.ఆ:ఒడ్డు,కంచి,కోర,కోలు,గంగ,గజ,గనప,గఱువ,గొప్ప, జగము,తారు,దండి, దొడ్డ, దొడ్డు,నాగ,పఱ,పెడ,పెద్ద,పేరు,పోట,బడ, బలు,బలువు,బుఱ్ఱ,బొంత,బోరు, మలచము,రపాము, వఱఁద, సుర, హురుమత్తు,హుర్మత్తు.

2. పా. (మనస్వహత్వము.) ఉక్కణము, దెప్పటికము,వెక్కసము.

ఉక్కడీఁడు.శ.వై. (శూరుఁడు)ఉక్కరి, ఉక్కుతునియ,ఎక్కటి,గండఁడు, గడుసరి,చాలుమానిసి,చుఱుకరి,చుఱుకటీఁడు,చుఱుకరి, జెట్టి, తెంపరి, దునీఁడు,దునీదారు, దునెదారి, దునేదారి, దుముదారి,నెఱసరి,పోటరి,పోటుకాఁడు,పోటుబంటు,పోటుమగఁడు,పోటుమానిసి,బంటు,బిరుదు, మగఁడు, మగవాఁడు,మనసరి,మాసటి,మాసటీఁడు, మాస్టీఁడు, మిడిమాసి, మొక్కలి, మొక్కలీఁడు, మొక్కలుఁడు, మొనకాఁడు, మొనసరి, వజీరుఁడు, వజ్జీరుఁడు,వజ్రీఁడు,వటారి, వడికాఁడు, వడిగలవాఁడు, వడివాఁడు, వాఁడిగలాఁడు,వాఁడిమగఁడు, వాలుమగఁడు,సరదారు,సరిమిడిమానిసి,హంవీరుఁడు.

ఉక్కణము.1.శ. (రక్షణము)చూ, అద్దికము. "చ.కడిందిమగల్ దగునుక్కణంబుగా,భయమను పేరులేక నిరపాయముగావిడిపించుచుక్ దునః, ప్రియమగు భంగిసేన నడిపించె.,,నిర్వ.౫.ఆ:

ఉక్కఁబట్టు.శ.స.క్రి.(విడుచు)ఊడుగు,ఊడువు,ఊరువు,ఎడఁబాయు, ఎడయు,ఎడలు,ఏవగించు,డిగఁద్రావు, డిగ్గఁద్రావు,డిగ్గనాడు,తక్కు,తరలు,తొఱఁగు,తొఱవు,దిగఁద్రావు, దిగనాడు,దిగవిడుచు,దిగ్గనాడు, పాయు,పోర్చు,మా

ను,రోయు,వదలు, విడఁదొ్రిక్కు,విడనాడు,విడుచు.

ఉక్కరి.శ. (శౌర్యవంతుఁడు,శూరుఁడు) చూ,ఉక్కడీఁడు.

ఉక్కలు .శ.అ.క్రి. చూ,౧ఉక్కడఁగు.

ఉక్కలుఁడు.శ.వై=(ఉత్కలః. ధురంధరుఁడు)

ఉక్కళము .1.శ.వై=(ఉపనిష్కరమ్.పురాభిముఖరాజమార్గము)
2.శ(శత్రువులెత్తి వచ్చుటను దెలిసికొనుటకైయుంచుకావలి)కోవరము, కోవురము. [మేలము,వెక్క సి.

ఉక్కళుఁడు.పా.వై (దుస్సహుఁడు)మిడి

ఉక్కిరిబిక్కిరి.శ(ఊపిరితిరుగనిది)

ఉక్కిఱి.పా(అనుచ్ఛ్వసనము)

ఉక్కివము.శ(కపటము)"సీ. గాండీవమాదిగాఁగలయాయుధంబులనుక్కివంబున నప్పుడొడిచికొనఁగ, మఱచినవాఁ డయ్యె"భా.ర.అర.౧.ఆ: కన్ను, కవుడు,కిటుకు,కీలు,కువాడము, కువాళము, కువ్యాపము, కైపు, కౌడు, గజను,గబ్బ,గిబ్బి, గవురు, గుబుసు, గౌరు,చిటుకము,జిత్తు,టనళిక, టాటోటు, తవళి, డంబము,డంబు,డబ్బ,తచ్చన, దుత్తూరము,నయగారము,నెపము, పిక్కు, పొచ్చెము,పొర,బూమియ,బూమె,మతకము,మయిసిక,వెడ్డు,వైసిక,సట.

ఉక్కివుఁడు.శ (కపటముగలవాఁడు, కుజనుఁడు)చూ,అడిగొంటు.

ఉక్కిస.శ(కాసము,పొడిదగ్గు)ఉబ్బసము, గస,దగ్గు,దగ్గు.

ఉక్కిఁడు.శ(మూఢుఁడు, తెలిసియు తెలియనివాఁడు) "ఉక్కిలయి నేర్పులేకతమకించిపయింబడినొచ్చు వారు"నిర్వ.
౩.ఆ:ఎడ్డె,ఎడ్డెఁడు,ఓగు,కఱటి,దుడ్డు, పాలసుఁడు,పెంక, పెచ్చారి, పెడకట్టె, పెడసరకట్టె,పెయ్య,పెళుచు,మంకు,మొండి, మొండికట్టె,మొండు, మెప్పియు,మొప్పె,మొఱకు, మొఱకుఁడు, మొఱటు,మొజ్జు,మోటు,మోఱకు,మోఱకుఁడు,మ్రోడు.

ఉక్కు.1.శ (శౌర్యము) చూ,౪.అగ్గలిక.
2.శ(అయస్సారము)
3.శ(స్థైర్యము)ఉఱిది,ఒఱపు, కడంక.
4.పా(దృఢము)చూ,౧.ఇట్టలము.
5.శ.అ.క్రి(మరణించు)చూ,ఇలుగు.
6—(నలఁగు)చూ,౨.ఇఱియు.

ఉక్కుతీఁగ.శ(ఉక్కుతంతి) [డీఁడు

ఉక్కుతునియ.1శ(శూరుఁడు)చూ,ఉక్క
2.శ(ఉక్కుతునుక)
3.పా(ధీరుఁడు) చూ,౧.ఉక్కు. [గు.

ఉక్కుమడఁగు.శ.అ.క్రి. చూ, ఉక్కడఁ

ఉక్కెఱ.శ.వై= (ఉపకారికా.చక్కెరఁజేర్చిపొరఁటినపిండి)

ఉగము.1.శ(ఆయువు) ఉసుఱు , మనన.
2.పా.వై(యుగము)

ఉగాది.శ(చాంద్రాయణసంవత్సరాది)

ఉగ్గడ.పా(మర్యాద)ఉగ్గుడు,కట్టడ,కర, గడి,గడువు,గరుసు,పడికట్టు,బవిసి,బైసి,మరియాద, మేర.

ఉగ్గడించు.1.శ.వై.అ.క్రి(శబ్దించు,ధ్వనించు)"బంగరుటందియలుగ్గడింపగ" పాండు.౨. ఆ: ఉలియు, కిలకొట్టు, క్రందిల్లు,క్రందు,క్రోలుచు, క్రోల్చు,గఱగఱలాడు,గిలకరించు,గీపెట్టు, గోడగించు, చెలఁగు,జడియు ,తీవుసు,బరలు, బోరుకలఁగు,బోరుకొను, మొగకట్టు, మొరయు,మ్రోఁగు,మ్రోయు,మ్రోవు, రవళించు,రవాళించు, రొదాళించు,లొటలొటమను,వాఁగు.
2.శ.స.క్రి(పచించు)చూ,౧.అను"హరినామాంకములుగ్గడించుచు ,, లక్ష్మీ.౫.

అ:

ఉగ్గడించుట,పా.(నాట్యానుగుణ శబ్దగుంభన) ఉగ్గడింపు,ఉగ్గలింపు.

ఉగ్గడింపు.1ప.3.౭౯(వినుతి)చూ,అగ్గింపు.
2.పా.చూ,ఉగ్గడించుట.

ఉగ్గడువు.1.శ.వై=(ఉత్కటః, అధికము) చూ,౪.అంకపాంకములు"చ.ఏటుగం టిచియుగ్గడువగునెత్తుటన్నడిసి క్రక్కుడునెత్తుటంగుంకుమచ్ఛవిం, బడసి" ఉ.హరి,౪.ఆ:
2.పా(వేలాతీతము)
3.పా(తీవ్రము,శీఘ్రము) చూ,౧.అంకపాంకములు. [వు]

ఉగ్గము.శ.వై= (ఉద్గారి)హః.భాండగళరజ్జు

ఉగ్గలింపు. భా.౧.౧౩౦.చూ,ఉగ్గడించుట

ఉగ్గళించు.శ.అ.క్రి (నట్టువుడుకొలిపించు)

ఉగ్గించు.శ.స.క్రి (పడుగుపేకలపోగులను చేర్చు)

ఉగ్గు.శ.చూ,ఉంగ.

ఉగ్గుడు.శ(మర్యాద)చూ,ఉగ్గడ.

ఉగ్గులు.శ (వసలు) "సీ. మేనియుగ్గులు, మాన్చిమెదలకచిత్రరూపముభంగిఁ బర్వతభాతినుండె,,వా.౪.ఆ:తరులు, తలులు, నెత్తలులు,నొక్కులు,ముడుతలు,ముక్కులు.

ఉగ్గుపడు.శ.అ.క్రి(ముడుతపడు)

ఉగ్గులువాఱు .శ.అ.క్రి(వెనఁగొను) చూ, అల్లిబిల్లిగొను.

ఉగ్మలి.శ.(స్త్రీ) చూ,అతివ.

ఉగ్రాణము.1.పా (భాండాగారము, ధనముంచెడుచోటు)ఖజానా,పంటసాల, బండరము,బండరువు, బండారము, బండారు,బొక్కసము,ములుగు.
2.శ(కోష్ఠము, సామగ్రులుంచెడుగది) కొటడి,కొట్టము, కొట్టు, కొఠారు,గిడ్డంగి.

ఉచింత.శ(కుండి*) ఉచ్చింత,ఉచ్చేంత.

ఉచుకరించు.శ.అ.క్రి (అనాదనముచేయుచుక్కుమను)

ఉచుక్కు.శ (ఉచుకరించుటయందగుధ్వన్యనుకరణము)చూ,అసుసుసురు.

ఉచ్చ.శ(మూత్రము)కొలుమడి, కొల్మడి, నీరు.

ఉచ్చబుడ్డ.శ (మూత్రకోశము)నీరుతిత్తి.

ఉచ్చమల్లి.శ (దిసమొలఆఁడుది, నగ్నిక) "వ.అయ్యవసరంబునఁగోటలియనంగ, నొక్కయుచ్చమల్లి వచ్చియడ్డపడిననా నగ్నికంజూచి,,ఉ.హరి.౬ ఆ:

ఉచ్చి.శ(బ్రహ్మరంధ్రము)జొదల,చోడు, నడినెత్తి,నడుగుంట, నుచ్చన, నుచ్చెన, మాడపట్టు,సోడు.

ఉచ్చింత.శ.చూ,ఉచింత.

ఉచ్చిచ్చిరే.శ.(కుక్కనుపిలుచుటయందగు ధ్వన్యనుకరణము) చూ, అసుసుసురు.

ఉచ్చు.1. శ. (పక్షులోనగువానికిఁ బెట్టెడియురి,వాగురు) ఉరి,గుచ్చిక,జువ్వ.
2.శ.అ.క్రి.(నాటివెడలు.) "ఎ.గీ.ఉరమునడిఁదాఁకివీఁపునఁయుచ్చిపోయె." భార.భీష్మ.3.ఆ:

ఉచ్చేంత.1.పా. చూ,ఉచింత

ఉజ.1శ.(ఊహ)

ఉజ్జగము. పా.వై. (విసర్జనము) చూ, అఱుట.

ఉజ్జగించు.భా.౩.౧౩౦.స.క్రి. (త్యజించు) ఉజ్జనచేయు,ఏదు,విడుచు.

ఉజ్జగింపు.భా.౨.౧౭౭.(విసర్జనము) చూ, అఱుట.

ఉజ్జగిల్లు.శ.వై.అ.క్రి.(అపసరిల్లు, తొలఁగు) "ముక్తా ద్వాపరముజ్జగిల్లుతజీ,, పాండు.3.ఆ:ఉడివోవు,ఊడనిఁబాడు,ఎడగిల్లు,ఎడయు,ఒదుఁగఁబాఱు, ఒదుగు,ఒదుగువడు,ఓరగిల్లు, ఓరసిల్లు,

ఓసరిలు,ఓసరిల్లు,ఓసరు, కేడించు, క్రేడించు,గెంటు,చెంగు, జడియు,జాఱువాఱు ,తలఁగు,తగ్గు, తలవు, తీయు, తూలఁబాఱు,తూలు,తెరలఁ బాఱు, తెరలు,తొలఁగఁబాఱు, తొలఁగు, నక్కు,పాయగిలు,పాయగిల్లు, పాయవడు,పాయవాఱు,పాయు,పేడెత్తు,ప్రిదులు,బెగడు,బెణఁకు,మిడివోవు, వసులు,విరియు.

ఉజ్జగొను.శ.స.క్రి(ఊహించు) "సీ-అపకీర్తి కొడఁబడునొగాము తెలియఁగఁ దుల జాభిమానంబులుజ్జగొనఁడు,,రుక్మాం. ౫.ఆ: ఉజ్జాయించు.

ఉజ్జన.పా .వై= (ఉజ్ఝనమ్. విసర్జనము) చూ,అఱుట.

ఉజ్జనము.శ.వై = —వై—

ఉజ్జనసేయు.శ.వై.అ.క్రి.(త్యజించు)చూ, ఉజ్జగించు."సంధ్యాభివందనశ్రద్ధయుజ్జనసేయు.,,కాశీ.౪.ఆ:

ఉజ్జాయించు.శ.స.క్రి.చూ,ఉజ్జగొను.

ఉజ్జి.శ. (సమానము) చూ,౩అనుగలము.

ఉజ్జుకల్లు.శ.(అగ్నిపర్వతము నుండివెడలఁ గ్రక్కఁబడినతాయి.)

ఉటంకము.శ.(సంగ్రహము)టూకి.

ఉటంకి.1.శ (చొరవగలవాఁడు)ఉటంకు.

2.శ.(గర్వశీలుఁడు)ఉటంకు. [కించు.

ఉటంకించు.శ.స.క్రి.(సంగ్రహించు) టూ

ఉటంకు.శ. చూ,ఉటంకి.

ఉట్టి.శ.(శిక్యము)చిక్కము. [ల.

ఉట్టిచీల.శ.(ఇరుప్రక్కల తలయేర్పడినచీ

ఉట్టిపడు.1.శ.అ.క్రి(అతిశయించు)చూ,౨అడరు."ఆయతబంధురలంఘనోద్ధతిక్ గూర్చినవేగముట్టిపడ."శేష.౨.ఆ:

2—.(ఉన్నట్టుండికలుగు)

ఉట్టు.1.శ (లవణజన్మస్థానము)ఉప్పళము, ఉప్పిలము, ఉప్పువాము, ఉప్పుఁబట్టి.

2.శ.అ.క్రి. (కాఱు,స్రవించు)ఉరలు, ఊడు,ఒలుకు,ఓడిగిల్లు, కరఁగు,కరఁగువడు,కయివాఱు, కైవాఱు, కాఱు, గిలు,చినుకు, జల్లించు,జాఱు,జొబ్బిలు, జొబ్బిల్లు,తొంగలిఁచు, తొట్టు,తొరఁగు,తొరుఁగు,దిగువాఱు,వడియు,వారు

ఉట్రవడియము.శ.(ఒకదినుసు వడియము)

ఉట్లబొద్దె.శ.(ఒకానొకచెట్టు)

ఉత్తాణి.శ.(ఉన్నతము)ఎగుడు,ఎగువ,ఎత్తరము,ఎత్తరవు,ఎత్తు,కొప్పు, క్రేళులు, తనరుపు,తనర్పు,పొడగు,పొడవు,పొడుగు,పొడువు,మిట్ట,మిడి,మిఱ్ఱి.

ఉడి.ప.౩.ఉర(స్వర్ధము) చూ,౫.అటమట

ఉడికిల్లు.శ.అ.క్రి.(తపించు) చూ,అరటపడు.

ఉడిగము.శ.(పరిచర్య)ఊడిగము,ఊడిగము,ఊడెము,కొట్నము,చాకిరి.

ఉడివోనిపల్కులు.బ.పా. (వేదములు) చదువులు,తొలిచదువులు, తొలుచదువులు, తొలుఁబలుకులు, తొలుమినుకులు,తొల్చదువులు,పెనుమినుకులు, ప్రాఁగబ్బములు,ప్రాఁజదువులు, ప్రాఁతపలుకులు, ప్రాఁబలుకులు, ప్రాఁబల్కులు, ప్రామినుకులు,ప్రామిన్కులు,మినుకులు,మొదటిమినుకులు.

ఉడివోవు.1.శ.అ.క్రి.(అపసరిల్లు)చూ,ఉజ్జగిల్లు."క.అడిసిగ్గులుఁతమకంబులు,నుడివోవఁగఁగేలికడఁకలొదవఁగ.,,మార్క.౫.ఆ. [డు

2.శ.అ.క్రి.(వ్యర్ధమగు)చూ,౧౦అడిప

ఉడుక.శ.వై= (హుడుక్క)ఉడుక్క, డుక్క, డుపుడక్క, డుబుడక్క, బుడిబుడుక్క, బుడుబుడుక్క,హుడుక,హుడుకు

ఉడుకొటము.శ (ఉడుకొడుట) [పడు

ఉడుకొడు.శ.అ.క్రి(తపించు) చూ,అరట

ఉడుకు.1.శ(సంతాపము)చూ,౨ అక్కసము. 2.పా(సూపకారము)బానసము, వంట,సువారము

3.శ.అ.క్రి (తపించు)చూ, ఆరటపడు

ఉడుకుబోతు. శ .చూ , ఈసుకాఁడు

ఉడుకువ.శ (విరతి) ఉడ్క్వ,ఊరట,ఊఱట,నిలుకడ,విఱుగడ [డుక.

ఉడుక్క.శ.వై= (హుడుక్క) చూ,ఉ

ఉడుగర.1.పా (విరళవస్త్రము)

2.శ (ఉపాయనము) చూ, అప్పనము "గీ.కడఁకరా సింగమునకుడుగరలొసంగె ,, అచ్చ.యు.కాం:

3.శ (బహుమానము)"వ. రాముండతనిఁగౌగిటంజేర్చి గారవించియుడుగరలిచ్చియనిచిన " యు.3 ఆ:

ఉడుగు.1.శ.అ.క్రి (కృశించు)ఊఁచపడు, ఊఁచపోవు,ఊసరిల్లు,ఒగుడుకఱచు,క్రియ్యు, క్రుయ్యఁబాఱు, క్రుయ్యు, చిక్కు,డయ్యు, తీయు,త్రాడువడు,నకనకఁబడు, నకనకలాడు, నకనకలుగుడుచు,నకనకలుడుచు, నయయు, పీఁకెవాఱు,ఒక్కటిల్లు,వక్కు,వట్టు,వడియు, సొటసొటవోవు,

2.శ . స.క్రి (విడుచు,మాను)చూ,ఉక్కఁబట్టు.

ఉడుత.శ.(చిక్రోడము)ఉఱుత.

ఉడుతచార.భా.౨.౧౫౪ (చిత్రవర్ణవిశేషము)తద్విశేషములు:—ఏనుఁగడుగు,కరకంము,గోటి,తన్ని,పట్టెమార్పు,పప్పళి, బసంతి,బొమ్మంచు, మాదవళము,మాదళము,మాదావళము, మాదావళి,హేరవళి.

ఉడుతచారంచు.పా(వస్త్రాంచలవిశేషము)

ఉడుపకుక్క.శ (ఉడుములోనగువానివేఁటాడెడుక్షుద్రశునకము) తద్విశేషములు:—కంచుడమారము, కార్చిచ్చు,గడిబోతు, గంపగ్రొడ్డలి,దొంగలమిండగీఁడు,బుడుకఁడు,మొఱసపము,రణబేరు.

ఉడుపపిల్ల.పా.(గాఢ్రేరము) [చు)

ఉడుపు.శ.పే.(ఉడుగఁజేయు,ఉడిగించు

ఉడుఁబోతు.శ.(విరతిశీలుఁడు)

ఉడుఁబోతుపింద.శ(కాపుఉడిగినపిమ్మట చెట్లయందు కలిగెడుపింద)

ఉడుము.శ.(గోధిక) ఉఱుము,ఏపరి, తేలుమేపరి.

ఉడువు.శ.స.క్రి.(విడుచు, మాను)చూ,ఉక్కఁబట్టు."ఉ.వింతయెకామునకు క్తినుడివింపఁగశక్యమెయెట్టివారికిన్." భార.ఆది.2ఆ:

ఉడుసర.శ (కాకమాచికా)కాఁచి,కామంచి, నల్లబుడుసర

ఉడ్క్వ.శ (విరతి)చూ,ఉడుకువ

ఉడ్డ.1.శ.(రాశి)ఉడ్డా,కుప్ప, కుఱు కు,కువ,కువ్వ,కూటువ,కూటువు,కొణిఁగె,గుట్ట,తిట,తిప్ప, తెట్ట, తెప్ప, తేప,దిబ్బ,దిమ్మ,పోర,పడ,పుంజి, ప్రుట్ట,పోగు,ప్రోక,ప్రోగు,ప్రోవు, రాసి,లప్ప,లిబ్బి,లొద్ద,వాలి.

2.శ.స (చతుస్సంఖ్య) చూ,౧ ఉడ్డ

ఉడ్డకేలుగలాఁడు. సాం. ౧.౪ (విష్ణువు) చూ, అడుగుచెమ్మటలాఁడు.

ఉడ్డకేలువేలుపు. శ. —పై—

ఉడ్డమోము వేలుపు.శ. (బ్రహ్మ) చూ,అంచరవుతు.

ఉడ్డా.1.శ.(రాశి)చూ,౧ఉడ్డ

2.శ.స.(చతుస్సంఖ్య)చూ,౧ఉడ్డ

ఉడ్డాడు.శ.అ.క్రి(క్షోభించు)చూ,అక్కలిపడు"ద్వి.వేగనంగనిపల్లె వెఱచియుడ్డాడ, నలయుకవర్షింపుఁడనిపల్కుయనుచ.,,భాగ.౧౦స్కం

ఉడ్డుగుడుచు.శ.అ.క్రి. (ఊపిరిత్రిప్పలేక బాధపడు,సంభ్రమపడు)చూ,౧౦.అదరు

ఉప్లపల్లంచి.శ.(బాలికా క్రీడావిశేషము) చూ,అంజి. [క్కిర

ఉణుజా.శ.(మత్స్యవిశేషము) చూ,అంబుప

ఉతక.శ.(ఉత్తరాసితిరిగెడుకొయ్య) ఉదక,రోలుమాను,లోలుమాను.

ఉతుకు.శ.స.క్రి.(ఉదుకు) ఉదుకు,ఉసుము, గుంజు,పులుము.

ఉత్త.శ.(శూన్యము) చూ,౨ఈటు.

ఉత్తండములు.శ.బ.(ఆఁడువారికంఠభూషావిశేషము) చూ, అడ్డిగలు.

ఉత్తండాలు.శ.బ.—పై.—

ఉత్తరద్వాక్కారము.శ.వై.=(ఉత్తరదోఃకరః,మల్లబంధవిశేషము) చూ,అంజమెడపట్టు. [ము

ఉత్తరాసి.శ.(తలుపుక్రింద తిరిగెడుకుబుస

ఉత్తరించు.శ.స.క్రి.(ఖండించు) చూ,౧అఱుకుసేయు."ద్వి.తలలుత్తరింతు.,,రా అర.కాం.

ఉత్తరిగ.భా.౨.౧౮౬ (సరవిశేషము) తద్విశేషములు.— కట్టుదండ, గుబ్బసరము, చీరము,తాళి,తాళీ, పదకము, బన్నసరము,బన్నసరి,ముత్తడము, ముత్తెసరము, ముత్తెసరి,మెఱుఁగునల్లులు.

ఉత్తరిగము.పా.వై.(అంసోత్తరీయము) ఒల్లియ,ఒల్లె,ఓణి,కండువ,కండువా,పంచ,పైఁబట్ట, బయిరవాసము, బైరవాసము.

ఉత్తరువు.శ.వై.(ఆజ్ఞ) చూ, అప్పణ.

ఉత్తరేను.1.శ.(అపామార్గము*)
2.పా. (ఖదిరము*) ఉలిమాను,కదరము,చండ్రి.

ఉత్తలపడు.1. శ.అ.క్రి. (సంక్షోభించు) చూ,అక్కలిపడు.
2— (సంభ్రమించు) చూ,౩అగడుపడు."పీచీభుజావళియాలింగనకేళికుత్తలపడక.,,హరి.పూ.౬.అ:
3.—(వ్యత్యస్తమగు)"గ్రామాశారకంబులు,త్తలపడఁజొచ్చె.,, భో. ౪.అ:తడఁబడు,తాఱుమారగు, తాఱుమాఱువడు.
4—.(పరితాపపడు,తపించు) చూ,అరటపడు. "అనవినుచుం గలంగుహృదయంబునఁ దాపమువిప్పఁటిల్ల.,, (అమీద)"అనుచుమత్తలపడన య్యవసరంబున.,,భార.విరా.౫.అ:

ఉత్తలపాటు.1.పా.(భయము) చూ,అంజిక.
2.పా.(సంభ్రమము) చూ,౭అక్కఱ.
3.పా.(దుఃఖము) చూ,౨అంగద.
4.పా.(అధైర్యము)
5.శ.(త్వరపడుట)
6.శ.(పరితాపపడుట)
7.శ.(వ్యత్యస్తమగుట)
8.శ.(కలఁతపడుట)

ఉత్తలపెట్టు.1.శ.స.క్రి.(త్వరపఱచు)
2—(పరితాపపడఁజేయు)
3—(వ్యత్యస్తముకావించు)
4.—.(కలఁతపఱచు)

ఉత్తలము.1.పా. (భయము) చూ,అంజిక.
2.శ. (సంభ్రమము) చూ,౭ అక్కఱ.
3.శ.(క్షోభము) చూ,౩అంకిలి
4.శ.(పరితాపము) చూ,౨అక్కసము.
5.శ.(వ్యత్యాసము) చూ,అకటవికటము. [మాఱు.

ఉత్తి.శ.(ప్రతివిధి,ఈడు) బదులు,పెట్టు,

ఉత్తుఁడు. శ.వై.=(యుక్తః,సమర్థుఁడు) చూ,అరుహుఁడు.

ఉదక.పా.చూ,ఉతక.

ఉదరిపడు.శ.అ.క్రి.చూ,అదరిపడు.

ఉదరిపాటు.1.శ.(అదరిపాటు)
2.శ.(ఉలికిపడుట) ఉలికిపాటు.

ఉదరు.శ.అ.క్రి. (చలించు) చూ,౧అటమ

టించు.
ఉదస్తు.పా.వై.(నివారితము)
ఉదియ.శ.వై=(ఉద్యోగః,యత్నము)చూ, ఆయతము. [౧.అంగవించు
ఉదియగొను.శ.అ.క్రి. (యత్నించు) చూ,
ఉదిరి.1.శ.చూ,అపరంజి"ఉదిరియంబరము వాఁడు.,,చంద్రా.౧.ఆ: [ము.
2.అం.౨.౫౫.(దృఢము)చూ,౧ఇట్టల
3.శ.(తప్తము) "సీ.ఇదికోలమెఱుఁగు గాని దుదిరిబంగారంపుఁ బసిమిగ్రమ్మె డుపచ్చ పట్టుగాని." పాండు. ౪. అ:
ఉదిరిగొను.శ.అ.క్రి. (తపించు) చూ,ఆరట పడు.
ఉదిల.1.పా. (భయము)చూ,అంజిక.
2.శ.(పరితాపము) చూ,౨అక్కసము.
ఉదిలగొను.శ.అ.క్రి.(పరితపించు)చూ,ఆర టపడు.
ఉదుకు.శ.స.క్రి.చూ,ఉతుకు. [ట
ఉదుట.ప.౩.౭౯ (ప్రశ్నము)చూ, ఆడుగు
ఉదుటు.1.శ(గర్వము)చూ,౧.ఆదటు.
2.శ(గర్వించినది)
3.పా (దృఢము)చూ,౧.ఇట్టలము.
4.పా(సౌందర్యము)చూ,౨.అంగము.
5.పా(ఔద్ధత్యము)
ఉదురు.పా(భయము)చూ,అంజిక.
ఉదురుమిడుకు.1.శ(ఉద్ధతుఁడు)
2.శ(దుర్వినీతుఁడు)
ఉద్ద.శ.ఉప(మిక్కిలి)
ఉద్దనవు.పా(అధి)చూ,అగావు.
ఉద్దము.పా.చూ,అరుచెప్పులు.
ఉద్దర.పా (అధి)చూ,అగావు.
ఉద్దరి.పా(విస్తారనిమ్నము)చూ,అవ.
ఉద్దరువు.శ.వై= (ఉద్ధారః)చూ,అగావు. (ఇదేవడ్డిలేనియప్పు) [ములు.
ఉద్దపడి.1.పా(క్రమము)చూ౧అంకపాంక
2.పా(క్రమము)ఉద్దవిడి,ఓజ,ఓలి, తె ఱఁగు,దార, సెప్పు,సెజె, పదకము,ప రువడి,బడి,మరియాద,మేర,లలి,వయిన ము,వరుసడి,వరుస,వావిరి,వైనము, సర వి,సారిది,ప్రావి.
ఉద్దవిడి.పా.—పై—.
ఉద్దాలు.శ.బ. (పాదరక్ష) గుమ్మాళి,చె ప్పు,పైజాలు, మలకడము, మలఁకవా లు,మెట్టు,లూడుపులు, సంబవులు,సం బాళిగలు,సమ్మాళిగలు. [ము
ఉద్ది.1.శ.ఏ. (సమానము) చూ,౩అనుగల
2.శ.(సస్యవిశేషము)
3.శ.(ద్వంద్వము,జంట)కవ,కవలి,గె డ,జంట,జత,జమట,జమలి, జమిడి,జ మిలి,జోక, జోడు, జోడుకోడియ,జో డుకోడె, దంట,దొందు,దోయి, సంగ డము,సంగడి.
4.శ. (గూడలులోనగువానితోఁజల్లనీ ళ్లుపాఱెడుకాలువ మొదటపచ్చికపె ళ్లలు మొదలగువానిచేనేర్పఱుపఁబడినమి ట్ట.)
ఉద్దించు.1.శ.స.క్రి.(జతపఱచు)
2.—(సరిపోలు) ఈడు, చాయవా లు,చెనయు, దీటుకొను, పురుడించు, పోలు,మక్కళించు,సోమించు.
ఉద్దికాఁడు.1.శ (జతయైనవాఁడు) "భా స్వంతునియుద్దికాఁ డు,, భల్లా.౪.ఆ:
2.శ(మిత్రుఁడు)చూ,౨.అంటు.
ఉద్దియ.1.శ.వై= (ఉద్యోగః.యత్నము) చూ,ఆయతము. 2.భా.౨.౩౦౨. (సా దృశ్యము)చూ,౩.అనుగలము.
ఉద్దియసేయు.శ.వై.అ.క్రి (యత్నించు) చూ,౧.అంగవించు.
ఉద్దీఁడు.శ.చూ,ఉద్దికాఁడు. [ళ్లు.
ఉద్దులు.శ.బ(ధాన్యవిశేషము)చూ,అక్కు
ఉనికి.1.శ.(స్థానము)చూ,౨ఇక్కు.
2.భా.౫.౧౪౫.(షడ్గుణములలోనాలవ

ది)చూ,౧.అండ.

3.శ(ఉండుట)"క.వేయొక తెఱఁగు నవారలకు, మాఱాడకయునికి లెస్స,, భార.విరా.౧.ఆ:

ఉనికిపట్టు.పా(గృహము)చూ,౧౩ క్క్క.

ఉనుకువ.శ(వాసము,ఉనికి)కొఁపు, కొఁపురము. [చు.

ఉనుచు.శ.క్రి(ఉండఁజేయు)చూ,౧.ఉం

ఉన్నరూపు.శ(యథార్థము)

ఉన్నవాఁడు.1.శ(అన్యుఁడు)"మ.వీ,డతఁడే కాదగునున్న వారలకు సారూప్య సంగతిసిద్ధింపదు,,భాగ. ౧౦.స్కం. ఎడకడవాఁడు,ఎడవాఁడు,ఎదురు,ఒండొకఁడు,ఒకఁడు, ఒకరుఁడు, ఒకరువుఁడు, ఒకొరుఁడు, ఒకొరువుఁడు,ఒక్కఁడు, ఒక్కరుఁడు, ఒక్కరువుఁడు,ఒక్కొరుఁడు, ఒక్కొరువుఁడు,ఒడ్డు,కడవాఁడు,తేరకాఁడు, రిత్తకాఁడు,వింతవాఁడు.

2.శ(ఉన్నట్టివాఁడు)

ఉన్ని.శ(గొఱ్ఱెబొచ్చు)త్రుప్పడు,బొచ్చు

ఉన్నె.శ.ని(ఉండునె)ఉన్నే.

ఉన్నే.శ.ని—పై—

ఉపతాయి.శ(మల్లవిజ్ఞానము)

ఉపమ.శ.వై=(ఉపాయః) చూ,౩. అను"గీ.నృపవధూటినివధింపనుపమయొకటి, యాత్మలోపలయోచించియద్భుతముగ"హరిశ్చ.౨.ఆ:

ఉపమరి.శ(ఉపాయశాలి) చూ,అనువరి.

ఉపవడము.శ(అవబోధము)ఉప్పవడము,కనువిచ్చుట,మెలఁకువ, మెలుకువ, మేలుకొంచుట, మేలుకొంచుట,మేలుకొంట,మేలుకోలు, మేల్కంట,మేల్కనుట,మేల్కొనుట.

ఉపారము. 1. పా. వై (ఉపాయనము) చూ,౨.అప్పనము

2.పా.వై(నైవేద్యపదార్థము)

ఉపాసము.శ.వై= (ఉపవాసః) చూ,ఇల్లి

ఉప్పట్టి.పా. (బాలక్రీడావిశేషము)చూ,అందలములు

ఉప్పతే.శ (అఘోషణము)గుపారు,గోరప,రంతు,రట్టడి, రట్టు,రద్ది,రద్దు,రవ్వ,సుడి

ఉప్పతి.పా. వై= (ఉత్పత్తిః, జన్మము) పుట్టు,పుట్టుక, పుట్టుగు,పుట్టుబడి,పుట్టువు,బాము,మేను

ఉప్పతించు. శ.స.క్రి (ఓర్వలేనితనముచేత ఆడిపోసికొను)

ఉప్పతిల్లు.1.శ.వై.అ.క్రి=(ఉత్పత్తిః,ఉత్పత్తియగు) చూ,౯.ఆవిరు

2.భా.౩.౯౪.వై. అ.క్రి (అధిక్యమగు) ఉప్పొంగు, ఉబుకు, ఉబ్బతిల్లు,ఉబ్బు,బొబ్బిలు,బొబ్బిల్లు, పొంగారు,పొంగు,వెలివిరియు,వెల్లివిరియు

ఉప్పఁదనము.పా (లవణధర్మము)ఉప్పన

ఉప్పన.1.పా —పై—

2.పా (లవణము)ఉప్పు,నీళ్లవరుగు

3.పా (ఊషరభూమి) ఊసర,ఊసరము,కారు,చగదు, చగుదు,చవటినేల,చవదు, చవుటినేల, చవుదు, చౌట,చౌదు.

ఉప్పనఁబట్టెలు. శ.బ (బాలక్రీడావిశేషము)చూ,అందలములు.

ఉప్పర.శ(ఉప్పరజాతి) [చూ,అప్పతాతి.

ఉప్పరము.1.శ.వై=(అభ్రమ్.ఆకాశము)

2.శ.వై(ఊర్ధ్వభాగము)"దోమతెరలుప్పరమెత్తిరి,,ఆము.౨.ఆ:ఎగుదల,ఎగువ,పయి,పై,పొడుగు, పొడువు, మీఁదు,మేలు.

ఉప్పరి.శ(ఖనకుఁడు) [ప్పుతాత.

ఉప్పరవీది.వెం.౨౦(ఆకాశము) చూ, అ

ఉప్పరించు.శ.స.క్రి(మల్లయుద్ధక్రియావిశేషము) "వ.మడమల మెడమలంచియుప

లించియుఁ, బిక్కలమొక్కలంబునఁ జప్పరించియు నుప్పరించియు,, ఉ. హరి. ౬. ఆ: ఉప్పళించు.

ఉప్పరిగ. శ. వై = (ఉపకారికా. సౌధము, ఉప్పరిగ, మహలు, మేడ, మేలిల్లు, మేలుమచ్చు, మేల్మచ్చు, సజ్జ.

ఉప్పరిగె. పా. వై ––పై––

ఉప్పలవాయి. శ (బొట్టనజొట్టనవ్రేళ్ల నడుము)" గీ. అంగుళాగ్రముల్ చిటికెనవలందు మొదలు, లనఘ దేవర్షి తీర్థములనఁగ బరఁగు, నరుసవల కేలి యుప్పలవాయిపైతృ, కంపుతీర్థంబు తర్పణకార్యమునను,, భార. అను. ౪. ఆ:

ఉప్పలి. శ (ఆపద) చూ, ౨. అంకిలి

ఉప్పవసము. శ. చూ, ఉపవసము.

ఉప్పళము. శ (లవణజన్మస్థానము) చూ, ౧. ఉట్టు [ఉప్పురాసులుండు చోటుఅని కొందఱు ]

ఉప్పళించు. శ. చూ, ఉప్పరించు" ఎ. గీ. కాలి నెసఁజోరవచ్చుటగానిపించు, నుడుగుసీసానఁ బట్టియు నుప్పళించి, పోవనిచ్చుమగుడ నేచిపొరఁజేరు, నెడలసరి సేయనగుతడవీక హత్తు,, భార. విరా. ౨. ఆ: [ఉప్పరించు, ఉప్పళించు ఈ రెండును సమానార్థకములుగా కనఁబడుచున్న

ఉప్పి. శ (కుంపలి) [వి

ఉప్పిఁడి. శ (అలవణము, ఉప్పులేనిది) చప్పఁదనము, చప్పన, చప్పిడి.

ఉప్పిలము. పా. చూ, ౧. ఉట్టు.

ఉప్పిరిఁత. శ (జ్యోతిష్మతి) ఎక్కుడుఁదీఁగ, మానెరు, మానేరు, మెఱపుఁదీఁగ.

ఉప్పిళ్లు. పా. బ (పక్వచ్ఛదవ్రీహితండులములు) ఉప్పుడు.

ఉప్పు. 1. శ (లవణము) చూ, ౨. ఉప్పన.

2. శ. స. క్రి (ఆవిరిపోకయుండికించు)

ఉప్పుకండ. పా (ఉప్పుచమిరి యెండఁబెట్టిన మాంసము) ఉప్పుఁగండ.

ఉప్పుఁగండ. శ ––పై––

ఉప్పుఁగడలి. శ (లవణసముద్రము)

ఉప్పుఁగాయ. శ (లవణభావితశలాటువు) ఊరుఁగాయ, రుచిఁగాయ.

ఉప్పుఁగుందము. శ (బాలక్రీడావిశేషము) చూ, అందలములు.

ఉప్పుఁజేప. శ (మత్స్యవిశేషము) చూ, అంబుపక్కర.

ఉప్పుఁబట్టి. శ. చూ, ౧. ఉట్టు.

ఉప్పుడు. శ. చూ, ఉప్పిళ్లు.

ఉప్పువాము. శ. చూ, ౧. ఉట్టు.

ఉప్పెన. 1. శ (విజృంభణము) చూ, ౨. ఉంకింపు "ఉ. వా, రుప్పెన మోహరజ్జాలసముద్ధతిఁ గట్టుచు ధర్మ్యు ప్రోలఁద, న్నొప్పన సేయుచున్నఁ గడు నుగ్రపు దాయలు గారెయూరయక,, శివ. ఉ. ౨. ఆ:

2. శ (సముద్రోల్బణము) పోటు.

ఉప్పొంగు. 1. శ. అ. క్రి (అధిక్యమగు) చూ, ౨. ఉప్పతిలు.

2. –– (విజృంభించు) చూ, ౬. అడరు.

3 –– (మిక్కిలిసంతోషించు) కడలుకొను. [లిక

ఉబలాటము. పా (ఉత్కంఠ) చూ, ౧. అగ్గ

ఉబుకు. 1. శ (పొంగుట) [తిలు.

2. శ. అ. క్రి (అధిక్యమగు) చూ, ౨. ఉప్ప

ఉబుసువాఁడు. పా (నిర్ఘృణుఁడు)

ఉబుసు. 1. శ (వార్త, వృత్తాంతము) " ఉ. ఇంచిన ప్రొద్దుపోకడకు నెవ్వరితో నుబుసేమి చెప్పుదుక్,, విక్ర. ౬. ఆ: ఊసు, కత, కద, చిట్టు, జోలి, పోలుపొంగు, మాట, ముచ్చట, వక్కాణము, సుద్ది.

2. శ (పనిలేనికాలము) ఊసు. [౩అవి.

ఉబ్బ. శ. వై= (ఉష్మః. ఊష్మము) చూ,

ఉబ్బకము. శ. వై (అధిక్యము) చూ, ౧. అగ్గలిక

ఉబ్బతిల్లు. శ. వై. అ. క్రి= (ఉల్బణమ్, అధిక్య

